శ్రీరస్తు  శుభమస్తు  అవిఘ్నమస్తు

# "అ ఆ ఇ ఈ" లలో
# అన్నమయ్య



రచన :
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.





**అ ఆ ఇ ఈ లలో అన్నమయ్య**

మొదటి ప్రచురణ
**మార్చి 2011**

రచన
అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు
M.Tech.
Cell: 9393021360

వెల : అమూల్యం

ప్రతులకు :
ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్థ నగర్,
హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360

డి.టి.పి. & ప్రింటింగ్ :
కె. మురళీ కృష్ణ
9848 51 51 09

# ముందుమాట

దేశభాషలందు తెలుగు లెస్స – అన్నాడు శ్రీకృష్ణదేవరాయలు. అన్ని భాషల్లోను తెలుగు 'లెస్సు' అన్నాడు ఇంగిలీసు నేర్చిన తెలుగువాడు. ఎంగిలి తిండికి అలవాటుపడి పల్లెల్లోనూ 'కాన్వెంటులు' వెంట వెంటనే వచ్చి అమ్మా నాన్నా పోయి మమ్మీ, డాడీలు వచ్చారు. 'తల్లీ! నిన్ను దలంచి' అని సరస్వతీదేవిని తలవకుండానే, 'బాబా! బ్లాక్ షీప్' అంటున్నాయి పిల్లగొట్టెలు. ఇది ఆ చిన్నారుల తప్పుకాదు. నాగరికులమనుకొనే అనాగరికులనుంచి పుట్టిన మాయరోగం. దీనికి మందు మంచి ఆలోచన. తనని తను ప్రేమించుకోవటం జీవలక్షణం. అమ్మా నాన్నలను ప్రేమించటం జీవి జన్మ లక్షణం. తనవారిని ప్రేమించటం సహజ లక్షణం. ఇందులో ఏ దోషములేదు. కాని, తన కన్నతల్లి వలెనే తనదేశాన్ని ప్రేమించాలి. తన తల్లి నేర్పిన భాషను ప్రేమించాలి. అందుకే 'చేయెత్తి జైకొట్టు తెలుగోడ' అని పాడాడు ఆనాటి కవి. నేడు ఈ డాలర్ పరుగులో ఆంధ్రభాషకు అన్ని అక్షరాలే అక్కర్లేదు, దాంట్లో సగం అక్షరాలున్న ఇంగ్లీషే థవుజండ్ టైమ్స్ బెటర్ అంటున్నాడు తెలుగోడు. అందుకని నేటి తెలుగు పిల్లవాడు 'కత్తి' బదులు 'కర్ర' అని వ్రాస్తుంటే వెరీగుడ్ అంటున్నాడు పంతులు.

ఇదంతా చూసి నాబోటి అనామకుడు (అమాయకుడు కూడ) చేసిన ఒక చిరుయత్నమే మీరు చదువుతున్న ''అఆఇఈ లలో అన్నమయ్య''. అన్నమాచార్యులవారి సంకీర్తనలపై అపరిమితమైన అనురాగం వున్న నేను జన బాహుళ్యంలో అత్యంత ప్రసిద్ధిచెందిన కీర్తనలనుండి, కీర్తనలోని మొదటి అక్షరము ఆధారముగా, యీ "అ ఆ ఇ ఈ లలో అన్నమయ్య" అనే సంకీర్తనలను సంకలనము చేసి మీ ముందు ఉంచుతున్నాను. నా ప్రధాన వుద్దేశ్యం పిల్లలకి (కొంతమంది పెద్దలకి కూడ) తెలుగు అక్షరాలను పరిచయం చేస్తూ అన్నమయ్య కీర్తనల ద్వారా అక్షరాలే కాక అక్షరక్రమం కూడ గుర్తుండేట్లు చేయడం. పిల్లలకి పాటలు తేలికగా గుర్తుంటాయి.





సంగీత సాహిత్యాలలో మీ పాపాయి మిమ్మల్ని పరవశింపచేస్తుంది. కీర్తన మొత్తం రాకపోయినా పర్వాలేదు. పల్లవి నేర్చుకొన్నా మనలక్ష్యం నెరవేరుతుంది. అమ్మ తన ఒడిలో కూర్చోబెట్టుకొని 'హ' అంటే తన పాపాయి "హరినామమే కడు ఆనందకరము మరుగవో మరుగవో మరుగవో మనసా" అని పల్లవి అందుకుంటే పులకించి పోని తల్లిదండ్రులుంటారా? పాపాయికి ఆ శ్రీహరి శ్రీరామరక్ష కాకుండా వుంటాడా? ఆలోచించండి. తల్లి "ఱాళ్ళతోటి కొట్టి అంపాలకోసినా" అని పద్యం చదివితే పాపాయి కాసేపు ఆలోచించి 'ఱ' అంటే అమ్మ యెంత ఆనందపడుతుంది! పాపాయికి అప్పుడు ఆ పద్యానికి సంబంధించిన ప్రహ్లాదుడి కథ చెబుతే 'ఱ' అనే అక్షరాన్ని పాపాలు మరువగలదా? కాబట్టి తల్లులారా! బామ్మలారా! అమ్మమ్మల్లారా! తండ్రులారా! తాతల్లారా! మీ ప్రయత్నం మీరూ చేయండి.

సాధుజనులారా! ప్రయత్నం మానకండి. తెలుగు గడ్డపై పుట్టి తెలుగు నేర్చుకోకపోవటం జన్మనిచ్చిన తల్లిదండ్రులను అమ్మా! నాన్నా! అని పిలువనంత నేరం దేవుని ఎదుట నిలబడి ఆ దేవునికి నమస్కరించనంత నేరం.

దయచేసి నేరస్థులు కాకండి. ఆలస్యమైనా ఆచరించేవాడే కృతకృత్యుడవుతాడు. ఎంత గొప్ప పరుగు పందేనికి అయినా మొదటి అడుగే ముఖ్యం. ఇక లేవండి. గమ్యం చేరండి. తెలుగు నేర్చుకోండి. తెలుగులో మాట్లాడండి.... తెలివిగా వుండండి.

# అంకితం

ఆ.వె॥ అంకితంబునిత్తు అన్నమయ్యా! నీకు
చిన్నిపాప నిన్ను సన్నుతించు
కీర్తనంబు పాడి కీర్తించు వెన్నుని
ముందు బ్రతుకునందు పొందునందు.

## ప్రార్థన

రాగం : బౌళి

శ్రీమన్నారాయణ శ్రీమన్నారాయణ
శ్రీమన్నారాయణ నీ శ్రీపాదమే శరణు ॥శ్రీ మన్నారాయణ॥

కమలాసతీముఖకమల కమలహిత
కమలప్రియ కమలేక్షణ
కమలాసనహిత గరుడగమన శ్రీ-
కమలనాభ నీ పదకమలమే శరణు ॥శ్రీ మన్నారాయణ॥

పరమయోగిజన భాగధేయ శ్రీ-
పరమపురుష పరాత్పరా
పరమాత్మా పరమాణురూప శ్రీ-
తిరువేంకటగిరిదేవా శరణు ॥ శ్రీ మన్నారాయణ॥

**భావామృతం :**

ఓ శ్రీ మన్నారాయణా శ్రీ మన్నారాయణా శ్రీ మన్నారాయణా మాకు మంగళకరమైన నీ యొక్క పాదపద్మములే శరణు.

లక్ష్మీదేవి ముఖకమలమునకు సూర్య భగవానునివలె ఆనందమొసగు వాడవు. పద్మములను ప్రీతితో హస్తమున ధరించువాడవు. తామరలవంటి కన్నులుగలవాడవు. కమలాసనుడైన బ్రహ్మదేవునకు మేలు చేయు తండ్రివి. గరుత్మంతునధిరోహించి సంచరించువాడవు. పద్మనాభుడవు. అట్టి నీ పాదపద్మములే మాకుశరణము.

పరమయోగులైన వారికి భాగ్యప్రదాతవు. పరమపురుషుడవు. శ్రేష్ఠుల కందరికీ శ్రేష్ఠుడవు. పరమాత్మవు. ఉత్కృష్టము మరియు అణురూపము కూడ ధరించువాడవు. అట్టి తిరువేంకటాద్రి నాయకా! నీకు శరణు. నాకే శరణు, శరణు.



అ ఆ ఇ ఈ లలో అన్నమయ్య

**1**

## అ

రాగం : మధ్యమావతి

అదివో అల్లదివో శ్రీహరివాసము
పదివేలు శేషుల పడగలమయము ॥అదివో॥

అదె వేంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాసమఖిల మునులకు
అదె చూడుడదె మొక్కుడానందమయము ॥అదివో॥

చెంగట నల్లదివో శేషాచలము
నింగినున్న దేవతల నిజవాసము
ముంగిట నల్లదివో మూలనున్నధనము
బంగారు శిఖరాల బహు బ్రహ్మమయము ॥అదివో॥

కైవల్యపదము వేంకటనగమదివో
శ్రీవేంకటపతికి సిరులైనది
భావింప సకల సంపదరూపమదివో
పావనములకెల్ల పావనమయము ॥అదివో॥

**భావామృతం :**

(ఒకసారి వాయుదేవునికి ఆదిశేషునికి మధ్య తమలో అధిక బలశాలి యెవరనే వివాదంవచ్చి, తగవు తీర్చటానికి నారదుని ఆశ్రయించారట. ఆయన ఆనంద పర్వతము నాశ్రయించమంటే వారా పర్వతాన్ని అడిగారట. శేషుడు నన్ను గట్టిగా బిగించి పట్టుకొంటే నువ్వు ఆ పట్టు విడిపించు అన్నదట వాయుదేవునితో 'ఆనందగిరి'.

ఆదిశేషుని పట్టుకి వాయుదేవుడు బిగిసిపోయి మానవులు ఊపిరాడక తల్లడిల్లారట. దేవతల అభ్యర్థన మేరకు శేషుడు జాలి తలచి పట్టుకాస్త సడలిస్తే వాయుదేవుడు ప్రచండవేగంతో ఆనందగిరిని ముక్కలు చేసేశాడట. దేవతల ప్రార్థన విని ఆదిశేషుడు ఒకదానిపై తన నివాసమేర్పరచుకొన్నాడట. అదే శేషాచలం. వృషభాద్రి, నారాయణాద్రి, అంజనాద్రి, గరుడాద్రి, వేంకటాద్రితో కలిసి ఏడుకొండలు ఆవిధంగా ఒక్కచోట వెలశాయి. వాటిని తన నివాసంగా ఏర్పరచుకొన్నాడు. వైకుంఠం నుంచి దిగివచ్చిన శ్రీమన్నారాయణుడు. తనే శ్రీవేంకటేశ్వరుడై వాటిపై వెలిశాడు)

అదిగో అల్లదిగో ఆ కనబడుతున్న వేంకటాచలం చూశారా! అదే శ్రీహరి నివాస స్థానము. అది ఆదిశేషుని పడగలతో నిండిపోయి వున్నది. (మనబోటి అల్పులకి కనబడదనుకో..) పదివేల పడగలమయమైన దానిని భావించి నమస్కరించి తరించండి. ఆ కనబడుతున్న వేంకటాచలం చూశారా! అది బ్రహ్మాదిదేవతలందరికి ఆప్యాయమైనది. మహామునులందరికీ ఆ కొండ నిత్యమూ నివాసస్థానం. వారు ఉండటానికి యెంచుకొన్నచోటు అదే సుమా! దాన్ని చూడండి. మొక్కండి. ఆనందం నిండి వుండే నెలవు అదే.

దాని దగ్గరలోనే వున్న పర్వతమే శేషాచలము. స్వర్గంలో వుండే దేవతలు భూమిపైకి వచ్చినప్పుడల్లా స్వయంగా వుండే చోటు అదే. మనయెట్ట నెదుట వుండే మూలధనం అదే. బంగారు శిఖరాలు (గోల్డ్‌కాదు...) గల ఆ పర్వతం బ్రహ్మర్షులు, బ్రహ్మత్వం సిద్ధించిన మహామహులందరికీ ఆటపట్టుగా విలసిల్లుచున్నది.

ఇక ఈ వేంకటాచలం మహిమ నేమని వర్ణించను? ఇది మోక్షప్రాప్యస్థానము. శ్రీమన్నారాయణుని అర్చావతారమైన శ్రీవేంకటేశ్వరునికి అపురూపమైన భాగ్యము ఇది. చక్కగా భావించగలిగితే సర్వసంపదలకి మారు రూపు ఇదే. పవిత్రమైన వాటన్నింటిలోకి అత్యంత పవిత్రమైనది ఈ వేంకటాచలమే.





# 2 ఆ

**రాగం : ముఖారి**

ఆకలివేళల-నలపైన వేళలను
తేకువ హరినామమే- దిక్కు మరి లేదు ||ఆకలి||

కొఱమాలియున్నవేళ-కులము చెడినవేళ
చెఱవడి యొరులచే-జిక్కినవేళ
ఒఱపైన హరినామ-మొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన-మఱి లేదు తెఱగు ||ఆకలి||

ఆపదవచ్చిన వేళ - ఆఱడి బడినవేళ
పాపపు వేళల -భయపడిన వేళ
ఓపినంత హరినామ-మొక్కటే గతిగాక
మాపుదాక బొరలిన-మఱిలేదు తెఱగు ||ఆకలి||

సంకెలబెట్టిన వేళ - చంప బిలిచినవేళ
అంకిలిగా నప్పులవా-రాగిన వేళ
వేంకటేశు నామమే - విడిపించ గతిగాక
మంకు బుద్ధి బొరలిన- మఱిలేదు తెఱగు ||ఆకలి||

**భావామృతం :**

ఆకలితో బాధపడుతున్నప్పుడు, అలసి శ్రమపడి యున్నప్పుడు, మానవులకు తేకువ (ధైర్యము) నొసగునది యేది? శ్రీహరి నామము ఒక్కటే దిక్కు కాని మరింకేదీ లేదు (అని గ్రహించండి). కొఱమాలియున్నవేళ (ఎందుకూ కొఱగాని స్థితియందు), కుల భ్రష్టత్వము చెందినప్పుడు, ఇతరుల చేతిలో జిక్కి చెరసాలలో బంధింపబడినప్పుడు, ఒఱపైన (చక్కటి) హరినామమొక్కటే గతి. పొరబాటుగానైనా ఇంకొకటి దిక్కు కాదని గ్రహించవలెను. అసలింకొక దారియే (తెఱవు) లేదు, ఉండబోదు.

మనకు అనుకోకుండా ఆపద సంభవించినప్పుడు, నిందకు గురియైన వేళలయందు, పాపము జరుగుచున్న వేళలయందు, భయకంపితులైయున్న సమయములలోను చేతనయినంత హరినామమొక్కటే దిక్కు. అంతేగాని చివరిదాక ఎంత బొరలినా(శ్రమించినా) ఇంకొకమార్గం లేదు.

నీపై వైరభావం కలిగినవారు సంకెళ్లతో బంధించి బాధించుచున్నప్పుడు, సంహరించుటకు సిద్ధపడినప్పుడు, అప్పులవాళ్లు అంకిలిగా (అడ్డుపడి) నిలబెట్టిన వేళ, ఆ శ్రీవేంకటేశ్వరుని నామమొక్కటే దిక్కు. అదొక్కటే నిన్ను విడిపించగలదు. అట్లుగాక మంకుబుద్ధితో (మూర్ఖత్వంతో) శ్రమిస్తే ఏమి ఉపయోగం? ఇంకొకదారి లేదు అని గ్రహించి ఆ ఏడుకొండల వాడిని "అన్యధా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ" అని వేడుకోండి. మిమ్మల్ని తప్పక రక్షిస్తాడు.

# 3 ఇ

**రాగం : బౌళి**

ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు-
నప్పడగు తిరువేంకటాధీశు గంటి ॥ఇప్పుడిటు॥

అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి
ప్రతిలేని గోపురప్రభలు గంటి
శతకోటి సూర్యతేజములు వెలుగగ గంటి
చతురాస్య పొడగంటి చయ్యన మేలుకొంటి ॥ఇప్పుడిటు॥

కనకరత్న కవాట కాంతు లిరుగడ గంటి
ఘనమైన దీపసంఘముల గంటి
అనుపమ మణిమయమగు కిరీటము గంటి
కనకాంబరము గంటి గ్రక్కున మేలుకొంటి ॥ఇప్పుడిటు॥





అరుదైన శంఖచక్రాదు లిరుగడ గంటి
సరిలేని అభయహస్తమును గంటి
తిరు వేంకటాచలాధిపుని జూడగ గంటి
హరిగంటి గురుగంటి నంతట మేలుకొంటి ॥ఇప్పుడిటు॥

**భావామృతం :**

(కలలో తనకు దివ్యదర్శనమొసగిన శ్రీ వేంకటేశ్వరుని ప్రత్యక్షానుభవాన్ని వర్ణిస్తున్నారు అన్నమాచార్యుల వారు. ప్రతి పాదంలోను ఆ అనుభూతిని గమనించండి.....) ఇప్పుడు నేనొక దివ్యస్వప్నమునుగాంచితిని. ఆ స్వప్నంలో సమస్తలోకములకు తండ్రియైన పవిత్రమూర్తి శ్రీవేంకటేశ్వరుని దర్శించితిని.

ఆ కలలో సర్వశ్రేష్టమైన శేషాచలమును చూచితిని. సరిసమానమనునదేలేని గోపురము యొక్క దివ్యకాంతులను చూచితిని. నూరుకోట్ల సూర్యుల అద్భుత కాంతిగలతేజస్సు నొకదానిని గాంచితిని. చతుర్ముఖుడైన బ్రహ్మను జూచితిని. అంతలోనే చటుక్కున మేలుకొంటిని.

రెండువైపులా రత్నఘచితమైన బంగారు తలుపులను చూచితిని. ఘనమైన దీపసమూహములను దర్శించితిని. సాటిలేని మణులు తాపినకిరీటములను చూచితిని. మేలిమి వస్త్రములను దర్శించితిని. వెంటనే నేను మేలుకొంటిని.

అరుదుగా కాని కనబడని దివ్య శంఖచక్రములను చూచితిని. సాటిలేని అభయహస్తమును దర్శించితిని. ఆ స్వప్నమున తిరుమలనాయకుని జూచితిని. జగద్గురువైన శ్రీహరిని దర్శించితిని. వెంటనే నేను మేలుకొంటిని.

# 4 ఈ

**రాగం : నాట**

ఈతడే రఘురాము డీతడేకాంగవీరుడు
యీతడు చేసిన చేతలెన్నియైనా గలవు ॥ఈతడే॥

ఖరదూషణాదులను ఖండతుండములు సేసె
అరుదుగా వాలినొక్క యమ్మున నేసె
సరవి కొండల చేత సముద్రము బంధించె
ఇరవై విభీషణునికిచ్చె లంకారాజ్యము ॥ఈతడె॥

కూడ పెట్టె వానరుల, కుంభకర్ణాది దైత్యుల
తోడనే రావణు జంపె దురము గెల్చె
వేడుకతో సీతాదేవి గూడెను పుష్పక మెక్కె
యీడు జోడై సింహాసన మేలె నయోధ్యలోన ॥ఈతడే॥

పుడమి యంతయు గాచె పొందుగా దనంతలేసి
కొడుకులగాంచెను కుశలవుల
యెడయక శ్రీవేంకటేశుడై వరములిచ్చె
అదరి తారక బ్రహ్మమై ఇదె వెలసె. ॥ఈతడే॥





**భావామృతం :**

ఓ ప్రజలారా! ఇదిగో ఈ మహానుభావుడే మన రఘురాముడు. ఈయన అసహాయశూరుడు. ఈయన చేసిన ఘనకార్యము లెన్నయినా వున్నాయి. (వాటిని కీర్తిస్తాను... వినండి).

ఆనాడు దండకారణ్యంలో ఖరదూషణాది రాక్షసులను పదివేలమందిని ఖండతుండములు (ముక్కలు ముక్కలుగ) చేశాడు. రావణాసురునే ముప్పుతిప్పలు పెట్టిన వాలిని ఒకే ఒక్క బాణంతో సంహరించాడు. సరవి (క్రమముగా లేక తదనంతరం) కొండరాళ్లతో సముద్రమున సేతు బంధనం చేశాడు. ఇరవై (ఇరవు+అయి=పాదుకొని) విభీషణుని లంకారాజ్యమునకు ప్రభువును చేశాడు.

ఒక్కవానరాన్నే చెప్పిన మాట వినేట్లు చేయటం కష్టం. అటువంటిది వానర సైన్యాన్నే నడిపించి కుంభకర్ణాది దైత్యులతో సహా రావణాసురుని సంహరించి దురము (యుద్ధము) గెల్చాడు. సంతోషముతో సీతాదేవిని స్వీకరించాడు. ఈడూ జోడైన ఆమెతో సింహాసన మలంకరించి అయోధ్యానగరాన్ని పరిపాలించాడు.

ఆ తరువాత భూమండలాన్నంతా, అశ్వమేధ యాగం చేసి సుభిక్షంగా, పొందుగా కాచె (అనుకూలముగా భూమిని పరిపాలించాడు. తనంతలేసి (తనతో సమానమైన ప్రతాపము కల) కుశలవులు అనే కొడుకులను గాంచినాడు. ఇదంతా ఆ త్రేతాయుగంలో జరిగినా... నేడు ఈ కలియుగంలో, యెడయక (విడువక) తిరుమలలో శ్రీవేంకటేశ్వరుడై తారకబ్రహ్మ (మోక్షప్రాప్తినిచ్చే పరబ్రహ్మవలె వెలసినాడు)

## 5 ఉ

**రాగం : ఖమాస్**

ఉగ్గు వెట్టరే వోయమ్మా చె-
య్యొగ్గీనిదె శిశు వోయమ్మా ॥ఉగ్గు వెట్టరే॥

కడుపులోని లోకమ్ములు గదలీ-
నొడలూచకురే వోయమ్మా
తొడికెడి సరుగన తొలగ దీయరే
వుడికెడి పాలివి వోయమ్మా ॥ఉగ్గు వోట్టరే॥

చప్పలు వట్టుక సన్నపు బాలుని-
నుప్పర మెత్తకురోయమ్మా
అప్పుడె సకలము నదిమీనోరనె
వొప్పదు తియ్యరె వోయమ్మా ॥ఉగ్గు వోట్టరే॥

తొయ్యలు లిటు చేతుల నలగించక
వుయ్యల నిడరే వోయమ్మా
కొయ్యమాటలను కొండల తిమ్మని
నొయ్యన తిట్టకురోరమ్మా ॥ఉగ్గు వెట్టరే॥

**భావామృతం**

ఓ అమ్మలారా! ఈ శిశువునకు ఉగ్గు (స్త్రీలు చనుబాలతో ఆముదం కొద్దిగా రంగరించి ఇచ్చేదే ఉగ్గు అంటే. ఇది పాపాయి జీర్ణవ్యవస్థను చక్కబరుస్తుంది. పాలుత్రాగే పాపాయికి తల్లులు ఉగ్గుపెట్టేవారు. ఇక్కడ అన్నమయ్య తనే యశోదయై





గోపికలతో ఈ పాట రూపంలో ఉగ్గుపెట్టండని చెబుతున్నారు)పెట్టండమ్మా! కాస్త చేతులు చాచి ఈ శిశువు ఉగ్గుకు అడ్డు పెడుతున్నాడమ్మా! అయినా ఉగ్గుపెట్టండమ్మా!

ఈబిడ్డ అట్లాంటిట్లాంటి సాధారణ శిశువు అనుకున్నారా ఏమర్రా! వీడు తన కడుపులో లోకాలన్నీ దాచుకొన్నాడు. మీరు గబగబా పిల్లాడిని ఊపితే వీడి ఒళ్ళంతా ఊగి లోకాలు తల్లడిల్లి పోతాయి కాస్త జాగ్రత్త. ఉడుకుడుకు పాలు పిల్లాడి మీద పొంగిపోయేట్లు చేస్తారా ఏమే? కాస్త జాగ్రత్త.

చిన్నపిల్లవాడర్రా! వీడిని జబ్బలు పట్టుకొని ఆకాశం వైపున కెత్తకండి (కళ్ళు తిరుగుతాయి చిన్నారికి). వాడి చిన్నారి నోట్లో ఆ ఉగ్గంతా ఒక్కసారి తోసేయకండే, వాడి నోట్లో అంత ఉగ్గుపడుతుందా. చూసుకోండమ్మా!

ఓ అమ్మాయిలూ! కాస్త జాగ్రత్త! వాడి నెత్తిమీద మొత్తకండి. వాణ్ణి అలిసిపోయేట్లు చేస్తారేమిటే! ఇక చాలు ఉయ్యాలలో పెట్టండి. వీడు కొండల తిమ్మయ్య (ఏడుకొండలవాడు) ఈ పాపాయిని కటువైన మాటలతో నిందించకండి.

## 6 ఊ

**రాగం :గౌళ**

ఊరకే దొరకునా ఉన్నతోన్నత సుఖము
సారంబు దెలిసికా జయము చేకొనుట ॥ఊరకే॥

తలపులోపలి చింత-దాటినప్పుడు గదా
అలరి దైవంబు ప్ర-త్యక్షమౌట
కలుషంపు దుర్మదము-గడచినప్పుడు గదా
తలకొన్న మోక్షంబు-తనకు జే పడుట ॥ఊరకే॥

కర్మంబు కసటువో-కడిగినప్పుడు గదా
నిర్మలజ్ఞానంబు-నెరవేరుట
మర్మంబు శ్రీహరిని-మఱగు జొచ్చినగదా
కూర్మి తన జన్మమె-క్కుడు కెక్కుడౌట ॥ఊరకే॥

తన శాంత మాత్మలో-దగలినప్పుడు గదా
పనిగొన్న తన చదువు-ఫలియించుట
ఎనలేని శ్రీవేంక-టేశ్వరుని దాస్యంబు
తనకు నబ్బిన గదా-దరిజేరి మనుట ॥ఊరకే॥

**భావామృతం :**

అత్యుత్తమమైన మోక్షసౌఖ్యము తగిన యత్నముజేయక చేజిక్కుతుందా? ఒక పనిలో విజయం కలుగవలెనంటే ఆ పనిలోని సారమునంతా గ్రహించి తగిన సాధనజేయవలెను కదా! ఊరకే ఏకార్యమైనా నెరవేరుతుందా?

ఆలోచనలలో చింత విడనాడితేనే కదా! భగవత్సాక్షాత్కారం సాధ్యపడుతుంది. మలినములతోనున్న దుర్మదమును అతిక్రమిస్తేనే కదా! మోక్షం ప్రాప్తించేది. ఊరకే నాకు మోక్షం కావాలి, మోక్షంకావాలి అని తపనపడితే మోక్షం దొరుకుతుందా?

ఒక జన్మలో ప్రాప్తించిన మాలిన్యం ఆ జన్మతో పోతుందనుకోవటానికి వీలులేదు. అది మరుజన్మలోనూ నీడలా వెంటాడవచ్చును. కాబట్టి ఏదో ఒక జన్మలో ఆ మాలిన్యాలన్నింటినీ పూర్తిగా కడిగివేసికొంటేనే కదా! నిర్మలమైన జ్ఞానం కలుగుతుంది. హృదయకమలంలో శ్రీమన్నారాయణుడు ప్రకాశిస్తేనే కదా!జన్మసాఫల్యం కలుగుతుంది. ఊరకే నాజన్మ చరితార్థం కావాలి అని కలలు కంటే అయిపోతుందా? ఎన్నటికీ అవదు.

ఆత్మశాంతి పొందిన తరువాత గాని ఎవ్వరికైనా తను చదువుకొన్న చదువుకు





సార్థకత కలుగదు. జతలేని తిరుమలనాయకుడైన శ్రీవేంకటేశ్వరుని దాస్యము తనకు లభిస్తేనే గాని సంసార సాగరంలో ఒడ్డుజేరట మనేది జరుగదు. (దీని గురించి తెలిసీతెలియని తత్త్వబోధకులు ఏమి జెప్పినా నమ్మకండి. ఓం నమో వేంకటేశాయ అని శరణాగతినొందండి)

## 7 ఋ

**ఆ.వె॥ ఋషుల గాచువాడు లోక రక్షకుడును**
**ఆర్తజనులకెల్ల అండ హరియె**
**వేదరయ్య! వాని వేంకటేశా! యని**
**అన్నమయ్య బాట నవధరించి.**

**భావామృతం :**

ఋషులను దీనజనులను దిక్కయి కాపాడు వాడు లోకాల రక్షకుడైన శ్రీహరియే. ఓ ప్రజలారా! ఆయన్ని శ్రీవేంకటేశ్వరా! అని, అన్నమయ్య బాట ననుసరించి వేడుకోండి.

## 8,9,10 ౠ, ఌ ౡ

**ఆ.వె॥ ౠ ఌ ౡ లు నేడు 'లుప్తమై' పోయెను**
**భాషయందులేదు వాడుకిపుడు**
**అన్నమయ్య పాట అదియెట్లునుండురా**
**వినుతగుణనిధాన! వేంకటేశ!**

**భావామృతం**

నేటి నవీన కాలంలో ౠ,ఌ ౡ అనే అక్షరాలు వాడుకలలో లేవు. ఇక అన్నమయ్య పాటలు ఆ అక్షరాలతో ఎలా మొదలవుతాయి? నుతించబడు సుగుణాలుకల వేంకటేశ్వరా! నీవిది వినుము ప్రభూ!

# 11 ఎ

**రాగం : బౌళి**

ఎక్కడి మానుషజన్మం బెత్తిన ఫలమేమున్నది
నిక్కము నిన్నెనమ్మితి నీచిత్తంబికను ॥ఎక్కడి॥

మరువను ఆహారంబును మరువను సంసారసుఖము
మరువను ఇంద్రియభోగము మాధవ నీమాయ
మరచెద సుజ్ఞానంబును మరచెద తత్త్వరహస్యము
మరచెద గురువును దైవము మాధవ నీమాయ ॥ఎక్కడి॥

విడువను పాపము పుణ్యము విడువను నాదుర్గుణములు
విడువను మిక్కిలి యాసలు విష్ణుడ నీమాయ
విడిచెద షట్కర్మంబులు విడిచెద వైరాగ్యంబును
విడిచెద నాచారంబును విష్ణుడ నీమాయ ॥ఎక్కడి॥

తగిలెద బహు లంపటముల తగిలెద బహుబంధంబుల
తగులను మోక్షపు మార్గము తలపున యెంతైనా
అగపడి శ్రీ వేంకటేశ్వర అంతర్యామివై
నగినగి నను నీవేలితి నాకా యీమాయ ॥ఎక్కడి॥

**భావామృతం**

ఎక్కడి మనుష్య జన్మస్వామీ! ఇది? ఈ జన్మయెత్తి ఏమన్నా ఉపయోగం వుందా? లేదు. ఇక నీ ఇష్టం. నిజం చెబుతున్నాను ప్రభూ! నేను నిన్నే నమ్ముకొన్నాను.

ఓ మాధవా! నేనెంత దౌర్భాగ్యుడినంటే.... ఆహారమును విడువలేను రోజుమూడుపూటలా తినవలసిందే. సంసారసుఖం వదులుకోలేను. ఇంద్రియ భోగం మీద ఇసుమంతైనా విరక్తి లేదు. ఇక వాటిని మరువనుకానీ మంచి జ్ఞానమును, తత్త్వరహస్యములను, జగత్పతియైన దైవమును, హితోపదేశం చేసే గురువును మాత్రం మఱచిపోతాను. దీనికి నేను కారణం కాదు ప్రభూ! నీమాయ ఆవరించడం చేత ఇట్లు జరుగుచున్నది.





ఓ విష్ణుదేవా! విడువకుండా పాపాలు పుణ్యాలు ఒకదాని వెంట ఇంకొకటి చేస్తూనే ఉన్నాను. నా చెడుగుణములను వదిలిపెట్టలేకున్నాను. ఆశాపాశముచే బంధింపబడి ఆశను విడువలేను ఇదంతా నీ మాయయే కదా! ఇదిట్లా వుంటే మానవులకు విధించబడిన ఆరు విధులను మాత్రం విడిచిపెట్టాను. వైరాగ్యం మాటనెత్తడం లేదు. ఆచారము అంటే ఏమిటో మఱచిపోయాను. విష్ణుస్వరూపా! ఇదంతా నీ మాయకాకామరేంటి?

ఓ ప్రభూ! నేను ఎన్నో చిక్కులలో తగులుకొంటాను. ఎన్నో బంధనములలో తగులుకొంటాను. ఇకపోతే నా ఆలోచనలలో కూడ మోక్షమార్గం జోలికి పోవటం లేదు. ఇవన్నీ జరిగినా నాకేం భయం? ఓ శ్రీవేంకటేశ్వరా! నాకు నీ దర్శనం అయింది. నీవు అంతర్యామిగా సంతోషంతో నన్ను రక్షిస్తున్నావు కదా! అట్టి నాకు నీమాయ అంటే ఏం భయం?

# 12 ఏ

**రాగం : హిందోళ**

ఏమని పొగడవచ్చునీతని ప్రభావము
వేమరువో పుణ్యులాల వినరో యీకతలు ॥ఏమని॥

అనంత సూర్యతేజుడట కాంతి చెప్పనెంత
దనుజాంతకుండట ప్రతాపమెంత
మనసిజగురుడట మరిచక్కదనమెంత
వనజజు గనినయట్టి వాడట ఘనతెంత ॥ఏమని॥

గంగాజనకుడట కదు చెప్పే పుణ్యమెంత
చెంగట భూకాంతుడట సింగారమెంత
రంగగు లక్ష్మీశుడట రాజసము లెంచనెంత
అంగవించు సర్వేశుడట సంపదెంత ॥ఏమని॥

మాయానాథుడట మహిమ వచించుటెంత
యేయెడ దావిష్ణుడట యిరవెంత
పాయక శ్రీ వేంకటాద్రి పతియై వరములిచ్చే
వేయిరూపుల వాడట విస్తారమెంత ॥ఏమని॥

**భావామృతం**

ఈ మహానుభావుని ప్రభావమును మనం ఏమని పొగడ గలము? మాటిమాటికీ ఈయన కథలను ఆలకించండి. ఓ పుణ్యాత్ములారా! అదే పుణ్యం అంటే.

లెక్క లేనంతమంది సూర్యుల కాంతి గలవాడీ స్వామి. ఇక ఆయన కాంతి ఎంతని చెప్పగలం? అసురులను నిర్మూలించుటయే ధ్యేయముగా కలవాని ప్రతాపమెంతటిదని చెప్పగలము? ఈయన మన్మథునికే కన్నతండ్రియట, మరి ఎంత చక్కని వాడో ఎలా చెప్పగలం? సృష్టికర్త అయిన చతుర్ముఖ బ్రహ్మగారినే సృష్టించిన కన్నతండ్రి ఈ స్వామి. మరి ఈయన ఘనత ఇంతని ఎలా చెప్పగలము?

సురగంగను తన పాదములనుండి పుట్టించిన పుణ్యమూర్తి పుణ్యమింతయని చెప్పగలమా? తన సమీపముననే భార్య భూదేవిని నిలుపుకొను సింగారాలు ఎలావర్ణించగలము? వైభవోపేతుడైన శ్రీ కాంతుని ఠీవిని యెంచగలమా? ఎల్లప్పుడు ఉత్సాహముతోనుండు ఈ సర్వేశ్వరుని సంపదయెంతటిదో ఎలా తెలుస్తుంది?

ఈ స్వామి మాయాదేవికే నాథుడు. ఈయన మహిమను చెప్పగలుగుట జరిగే పనేనా? ఎక్కడబడితే అక్కడ వ్యాపించియుండేవాడు కావుననే ఈయనను విష్ణువు అన్నారు. ఇక ఇది ఈయనుండే చోటని చెప్పగలమా? విడువకుండా వేంకటపతియై అంతులేని వరములిచ్చే విశ్వరూపుడైన వేయిరూపముల జగదీశ్వరుని వైశాల్యమెంతో చెప్పే శక్తి ఎవరికుంది?





## 13 ఐ

**ఐతివే యేలికెసాని వందరికిని**
**నీతితో సవతులెల్ల నీకు లోనే యింకను ॥పల్లవి॥**
**ఆరసి నీ కాతఁడు అరవడమచ్చునే**
**పేరు రాన నేపొద్దూఁ బెట్టుకున్నాఁడు**
**సారెకు నీవు మంచి సకినాన వచ్చితివే**
**యీరాని చనవులెల్లా నిచ్చినాఁడు నీకు ॥ఐతివే॥**
**పొందుల నీకాతనికి పొంతనాలు గూడునే**
**మందలించి నీవాడినమాట దోయఁడు**
**యెందును నీమొకమాయ మందు యెటువంటిదే**
**కందువ నీ మోవికే కాచుకున్నాఁ డిపుదు ॥ఐతివే॥**
**చెలఁగి మంచివేళనే సేస నీవు వెట్టితివే**
**కలసి పాయఁడు శ్రీ వేంకటేశ్వరుడు**
**అలరి మమ్మేలెనాతఁడప్పుణ నీవిచ్చితివే**
**వలపించ నేరుతువే వసమాయ నతఁడు ॥ఐతివే॥**

**భావామృతం**

(ఓ చెలియా!) మొత్తానికి అందరికిని (స్వామిని వలచిన వారందరికీ) నీవు 'యేలికసాని' (రాజవేశ్య)వై పోయావు. ఆయఁనను వలచిన మా బోటి సామాన్యులందరూ నీ సవతులు. ఇక నీతో (న్యాయప్రకారము) ఈ సవతులందరూ నీకు 'లోనే' లొంగియుండవలసినవారే.

నీకు (నిన్ను) ఆయన కావాలని 'ఏపొద్దూ' (అన్నివేళలా), అచ్చునే (అచ్చుముగా), 'పేరురాన' (ప్రేమతో) అరవడము పెట్టుకొన్నాడు (వుంచుకున్నాడు) ఆయన ఇష్టం. నీవు సారెకు (ఈ పర్యాయము) మంచి 'సకినాన వచ్చితివి. (శకునం చూసి వచ్చినట్లున్నావు), నీకు ఆయన ఇయ్యకూడని స్వాతంత్ర్యము ఇచ్చాడు. ఇకనేం.. యేలికసానివైపోయావు.

నీకు ఆయనకు పొందుల (కూటములలో) పొంతనాలు గూడునే (మంచి స్నేహము కలిసినది). నీవాడిన మాటను ఆయన దోయడు (మందలించి కాదనలేదు). యెందును (ఇక యెప్పుడైనా), ఆయనకు నీమొకమాయ మందు (నీ అందమైన

ముఖము మందు అయిపోయింది). ఎటువంటిదే.. ఇప్పుడు నీ తీయటి అధరామృతం కోసం కాచుకొనియున్నాడు.

ఓ సఖీ! చెలగి (ఉత్సుకతతో) నీవు మంచివేళనే, సేసవెట్టితివి (ఆ స్వామి ఆశీర్వాదం పొందినావు). ఈ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కలసి పాయడు (నీపొందు విడువడు). నీ పొందువలన అలరి (తృప్తుడై) స్వామి మిమ్మల్ని కూడా యేలె (మన్నించినాడు). ఆయన అందరినీ ఏలే శృంగారరాయడు కదా!

## 14 ఓ

**రాగం : ఖరహరప్రియ**

ఒకపరి కొకపరి కొయ్యారమై
మొకమున కళలెల్ల మొలచినట్లుండె ॥ఒకపరి॥

జగదేకపతిమేన చల్లిన కర్పూరధూళి
జిగికొని నలువంక చిందగాను
మొగి చంద్రముఖి నురమున నిలిపెగాన
పొగరు వెన్నెల దిగబోసి నట్లుండె ॥ఒకపరి॥

పొరి మెఱుగు చెక్కుల పూసిన తట్టుపునుగు
కరగి ఇరుదెసల కారగాను
కరిగమన విభుడు గనుక మోహమదము
తొరిగి సామజసిరి తొలికినట్లుండె ॥ఒకపరి॥

మెఱయు శ్రీవేంకటేశు మేన సింగారముగాను
తఱచైన సొమ్ములు ధరియించగా
మెఱుగు బోణీ అలమేలు మంగయు తాను
మెఱుపు మేఘము గూడి మెఱసినట్లుండె ॥ఒకపరి॥

**భావామృతం :**

(ఆహా!! ఎంత అద్భుతంగా వుంది ఈ జంట. ఏమి అందం!!) ఒకసారి ఒకరకమైన అందం, ఇంకొకసారి ఇంకొకరకమైన అందం... స్వామివారి ముఖమున కళలన్నీ మొలక లెత్తాయా? అనునట్లున్నది. (వర్ణనాతీతమైన వీరి సౌందర్యం గురించి యెంత చెప్పినా... తక్కువే అవుతుంది)



అ ఆ ఇ ఈ లలో అన్నమయ్య

ఈయనెవరు? జగదీశ్వరుడు, జగదేకపతి, ఈయన దేహంపై కర్పూరం పొడి చల్లారు. దాని జిగి(కాంతి) నలుదిశలా చిందుతున్నది. ఇటుచూస్తే ఈ చంద్రముఖిని ఈయన తన హృదయంపై వుంచి నిలుపుకొన్నాడు. అందువలన పొగరు వెన్నెల (దట్టంగా కాస్తున్న వెన్నెల) దిగబోసినట్లుండె (కురిసినట్లున్నది).

ఓహో! పొరి మెఱుగు చెక్కుల (పదేపదే మెఱయుచున్న చెక్కిళ్ళు) పై పూసిన తట్టుపునుగు కరిగి ఆయన రెండు చెక్కిళ్ళు (చెంపల) పై కారుచున్నది. ఈ స్వామి సామజవరగమనుడు (మదపుటేనుగు నడక వంటి ఠీవి గల నడకగల వాడు) అమ్మవారిపై ఈ స్వామికున్న మోహము, మోహమదమువలె స్రవించుచుండుటచేత, ఈయనను సాజముతో పోల్చుట యెంతయో సమంజసముగా నున్నది. తొరిగి సామజసిరి దొలకి నట్లున్నది. (స్రవించుచున్న మదపుటేనుగు యొక్క మదజలము చెక్కులపై ఒలికినట్లున్నది).

శ్రీవేంకటేశ్వరుని శరీరంపై సింగారింపబడి తళతళ మెఱయు ఆభరణములు అనేకములు అలంకరింపబడినవి. మెఱుగు బోణి (మెఱయుచున్న శరీరముగల) ఈ అలమేల్మంగమ్మ ఈ స్వామి పక్కన వుంటే నల్లటి మేఘముల మధ్య తటిల్లత (మెఱుపు) తళుక్కుమన్నట్లున్నది. ఈ సౌందర్యం కన్నులారా చూచిన వారి జన్మ ధన్యము. అందుకు సందేహమా?

## 15 ఓ

**రాగం : శ్రీరాగం**

ఓ పవనాత్మజ ఓ ఘనుడా
బాపు బాపనగ పరగితిగా ॥ఓ పవనాత్మజ॥

ఓ హనుమంతుడ ఉదయాచల ని-
ర్వాహక నిజసర్వప్రబలా
దేహము మోచిన తెగువకు నిటువలె
సాహసమిటువలె చాటితిగా ॥ఓ పవనాత్మజ॥

ఓ రవి గ్రహణ ఓ దనుజాంతక
మారులేక మతి మలసితిగా
దారుణపు వినతా తనయాదులు
గారవింపనిటు కలిగితిగా ॥ఓ పవనాత్మజ॥

ఓ దశముఖహర ఓ వేంకటపతి-
పాదసరోరుహ పాలకుడా
ఈ దేహముతో ఇన్నిలోకములు
నీ దేహమెక్క నిలిచితిగా ॥ఓ పవనాత్మజ॥

**భావామృతం :**

వాయునందనుడవైన ఓ ఆంజనేయా! ఓ ఉద్దండుడా! నీ భక్తులందరు 'బాబోయ్' 'అమ్మబాబోయ్' అనునట్లు వర్ధిల్లితివి కదా!

తూర్పునవున్న 'ఉదయాచలము'ను నిర్వహించిన ఓ హనుమంతా! అన్ని విధములా వ్యాపించిన మహానుభావా! సూర్యగమనమునకు అనుగుణంగా మహాకాయమును దాల్చి ఇటువంటి సాహసము చూపించితివి (సూర్యని ద్వారా వేదములను నేర్చుటకు స్వామి గొప్ప ఆకారముతో సూర్యుని అనుసరిస్తూ, వింటూ ఏకసంతాగ్రాహిగా వేద విద్య నేర్చాడు.) ఇటువంటి ధైర్యము (సూర్యుని దగ్గరకు ముఖం పెడితే కాలి బూడిదైపోతాం కదా!) ఇంకొకరికి వుంటుందా?

(చిన్నపాపాయిగా వున్నప్పుడే సూర్యుని తినే పండు అనుకొని ఆ సూర్యుని 'గ్రహించుటకు' ఎగిరి పట్టుకోబోయాడు.) అంత అల్లరి పిల్లవాడా! ఓ రాక్షసాంతకా! లంకలో ఎదురులేక చిత్తమొచ్చినరీతి వ్యవహరించితివి కదా! వినతాసుతుడైన గరుత్మంతుడు తను స్వయంగా గొప్ప శక్తిమంతుడై కూడ నిన్ను తన సాటివానిగా గుర్తించి ఆదరించగా ఈ విధముగా ప్రబలినాడువు కదా





పదితలల రావణాసురుని గర్వభంగము జేసిన ఓ మారుతీ! శ్రీ వేంకటేశ్వరుని పాదపద్మములను తలదాల్చు మహానుభావా! ఇటువంటి అసదృశమైన దేహముతో ఇన్నిలోకములను నీ దేహము అధిగమించునట్లు నిలిచితివి కదా! నీ పరాక్రమము సాటిలేనిది.

## 16 ఔ

**రాగం : తిలంగ్**

ఔనయ్య జాణడవు ప్రహ్లాద వరద
ఆనలు వెట్టకుము ప్రహ్లాద వరద ॥ఔనయ్యా॥

వేసరక శ్రీసతితో వేడుక నవ్వులు నవ్వీ
ఆసలు చూపేవు ప్రహ్లాద వరద
సేస వెట్టిన చేతుల చెరగువట్టి తీసేవు
ఆ సుద్దులె చెప్పేను ప్రహ్లాద వరద ॥ఔనయ్యా॥

నంటున తొడమీదను నలినాక్షినెక్కించుక
అంటేవు సిగ్గులు ప్రహ్లాదవరద
గెంటక ఏ పొద్దును కేలు కేలు కీలించుక
అంటువాయ వదివో ప్రహ్లాద వరద ॥ఔనయ్యా॥

కందువతో కాగిలించి కైవసము సేసుకొంటి
వందముగ నీకెను ప్రహ్లాద వరద
పొంది శ్రీవేంకటమున పొంచి ఔభళములోన
అంది వరాలిచ్చేవు ప్రహ్లాద వరద ॥ఔనయ్యా॥

## భావామృతం

ఓ ప్రహ్లాద వరదా! అహోబల నృసింహా! ఔనయ్యా! నీవు జాణతనంగలవాడవే. మాకు ఆనలు (నిర్బంధము కలిగించు షరతులు) పెట్టవద్దు తండ్రీ! (నీవు పెడితే మేం తట్టుకోలేము, మేము పెడితే నీవు అవలీలగా దాటివేస్తావు).

వేసరక (సునాయాసంగా) శ్రీలక్ష్మితో విలాసముగా నవ్వులొలక బోస్తున్నావు. ఆమెకు ఆస (అపేక్ష) చూపుచున్నావు. ప్రహ్లాదుని దీవించావు. సేసవెట్టిన (అక్షతలు చల్లిన) ఆ చేతులతోనే నిర్బంధించి హిరణ్యకశిపుని ప్రాణములు తీసేవు. ఓ ప్రహ్లాద వరదా! నేను ఆ సుద్దులు చేప్పేను (ఆ కథలను వివరిస్తాను).

ఓ ప్రహ్లాద వరదా! పద్మనేత్రియైన శ్రీలలనను నంటున (స్నేహముతో) నీతొడపై కూర్చుండబెట్టుకొని ఆమె సిగ్గులను (లజ్జను) స్పృశించెదవు. ఏ సమయముననైనా ఆమెను గెంటక (నెట్టివేయక), కేలుకేలుకీలించి (చేయి చేయి తగలించి), అంటువాయవు (విడనాడవు)

కందువతో (సామర్థ్యముతో) అందముగ ఈకెను (ఆమెను) కౌగలించి నీ వశము చేసికొంటివి. శ్రీవేంకటగిరిపై ఈమెనా విధముగా పొంది, ఇక్కడ ఈ ఔభళములో (అహోబలంలో) అంతులేని వరములను అనుగ్రహించుచున్నావు.

## 17 అం

**రాగం : సురటి**

అంగన లీరె యారతులు
అంగజ గురునకు నారతులూ ॥అంగన॥





శ్రీ దేవి తోడుత చెలగుచు నవ్వే
ఆదిమ పురుషుని కారతులు
మేదినీ రమణి మేలము లాడేటి
ఆదిత్య తేజున కారతులు ॥అంగన॥

సురలకు నమృతము సొరిది నొసంగిన
హరికిది వో పసిడారతులు
తరమిది దుష్టుల దనుజుల నడచిన
అరి భయంకరున కారతులూ ॥అంగన॥

నిచ్చలు కళ్యాణ నిధియై యేగేటి –
అచ్చుతునకు నివె యారతులు
చొచ్చి శ్రీ వేంకటేశుడు నలమేల్మంగ
యచ్చుగ నిలిచిరి యారతులు ॥అంగన॥

## భావామృతం

ఓ వనితల్లారా! హారతులెత్తండమ్మా! మన్మధునికే తండ్రి అయిన ఈ మహానుభావుడికి హారతులనీయండి.

శ్రీదేవితో ఏదో చలోక్తికి నవ్వుతున్న ఈ ఆదిపురుషునికి హారతుల నీయండి. భూదేవితో సరసములాడుచు దర్శనమిస్తున్న ఈ సూర్యతేజో విరాజితునికి మీరంతా హారతులనీయండి.

దేవతలకు మోహినీ అవతారమున వరుసలో నిలువ జేసి అమృతము పంచి ఇచ్చిన హరికి ఇవే బంగారు హారతులు. దుర్మార్గులైన దానవులను వరుసగా మట్టుబెట్టి శత్రు భయంకరుడైన హరికి హారతులివియే.

నిత్య కళ్యాణము జరిపించుకొని ఊరేగు అచ్యుతునికి ఇవే మంగళహారతులు. ఆవిర్భవించిన శ్రీ వేంకటేశ్వరుడు అలమేలు మంగమ్మ చక్కగా నిలిచియున్నారు. వారికివే కర్పూర నీరాజనములు.

# 18 అః

**ఆ.వె॥ 'అః'యనే విసర్గ అగుపడదుర 'కంట'**
**వేంకటేశ! నిన్ను వినుతిజేసి**
**లెక్కకొరకు దీని నిక్కడ జెప్పాము**
**అన్నమయ్య పాట అసలు లేదు.**

**భావామృతం**

విసర్గ నేటి కాలంలో తెలుగు భాషలో వాడుకలో లేదు. కానీ లెక్క ప్రకారం దాన్ని వివరించాను. కీర్తించబడు సద్గుణాలు గల వేంకటేశ్వరా! అన్నమయ్య పాట మాత్రం ఃతో ఎలా మొదలవుతుంది?

# 19 క

**రాగం : హిందోళము**

కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
తెట్టెలాయ మహిమలే తిరుమల కొండ ॥కట్టెదుర॥

వేదములే శిలలై వెలసినది కొండ
యేదెస పుణ్యరాసులే యేరులైనది కొండ
గాదివి బ్రహ్మాది లోకముల కొనలకొండ
శ్రీ దేవుడుండేటి శేషాద్రి యీకొండ ॥కట్టెదుర॥





సర్వదేవతలు మృగజాతులై చరించే కొండ
నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ
వుర్విదపసులే తరువులై నిలిచిన కొండ
పూర్వపు టంజనాద్రి యీ పొడవాటికొండ ॥కట్టెదుర॥

వరములు కొటారుగ వక్కణించి పెంచే కొండ
పరగు లక్ష్మీకాంతు సోబనపు కొండ
కురిసి సంపదలెల్ల గుహల నిండిన కొండ
విరివైన దిదివో శ్రీవేంకటపు కొండ ॥కట్టెదుర॥

**భావామృతం :**

ఇదిగో మన యెట్టయెదుటనున్న కొండలను గమనించారా! ఇదే ఏడుకొండలని ప్రసిద్ధి చెందిన తిరుమలకొండ. శ్రీహరి చిరకాల నివాసం (కాణాచి) అయిన వైకుంఠమే ఈ కొండ అని గ్రహించండి. దీని మహిమలన్నీ రాసులుగా పోగయి (తెట్టెలై) ఒకే చోటకుప్పగావున్న మహిమాన్వితమైన కొండ ఇది.

వేదములన్నీ శిలలుగా వెలసినదే ఈ తిరుమల. ఎటుచూసినా, దీనిపై పారే ఏరులన్నీ మహానుభావులు చేసిన పుణ్యముల యొక్కరాసులే. దీని శిఖరములన్నీ ప్రేమతో బ్రహ్మాదిలోకములు రూపం దాల్చినవే. ఈ శేషాద్రి వుంది చూశారా, ఇది సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు వుండే కొండ.

ఈ కొండపైనున్న మృగములు మృగజాతులు అన్నీ కూడా కిన్నెర, కింపురుష, గంధర్వాది దేవతలే. సమస్త సముద్రములు పూనుకొని ఈ కొండపై నిట్టచరులై (సెలయేళ్ళుగా) పారుతున్నాయి. మహర్షులందరు ఈ కొండపైనున్న వృక్షములే సుమా!!

ఇదిగో ఎత్తయిన ఈ కొండవున్నది చూశారా, ఇదే తూర్పువైపునున్న అంజనాద్రి.

పరమాత్ముడొసగిన వరములన్నీ గిద్దంగులు (కొటారుల) గా వచించబడినదీ సమృద్ధినిచ్చే కొండే ఇది (ఆయన వరములే పెద్దపెద్ద నిలువలు). చూడగా శ్రీనాథుని మంగళప్రదమైన కొండ ఈ తిరుమలయే. సర్వసంపదలు కురిసి రాసులుగా గుహలలో నిండి పోయిన కొండ ఇదే. ఓ ప్రజలార! ఇదిగో ఈ శ్రీవేంకటాద్రి గొప్ప విస్తృతమైన కొండ.

## ఖ

## 20

**ఆ.వె॥ ఖడ్గధారియైన 'కల్కి' రూపుడు హరి**
**అణచ దుష్టజనుల నవతరించు**
**అన్నమయ్య పాట కాదిలో లేదు 'ఖ'**
**సంకటంబు కలిగె వేంకటేశ!**

**భావామృతం :**

కల్కి అవతారం యెత్తిన శ్రీహరి ఖడ్గంచేత ధరించి దుష్టశిక్షణ చేస్తాడు. అన్నమయ్య కీర్తనలలో 'ఖ' తో ఆరంభమయ్యే కీర్తన నా కంటబడలేదు. ఓ శ్రీవేంకటేశ్వరా! అందుచేత ఇబ్బంది కలిగింది.

## గ

## 21

**రాగం : మోహన**

గతులన్ని ఖిలమైన కలియుగమందును
గతి ఈతడే చూపె ఘన గురుదైవము ॥గతులన్ని॥





ఈతని కరుణనేకా ఇల వైష్ణవుల మైతి-
మీతని వల్లనే కంటి మీ తిరుమణి
ఈతడే ఉపదేశమిచ్చెను అష్టాక్షరి మంత్రము
ఈతడే రామానుజు లిహపరదైవము ॥గతులన్ని॥

వెలయించెనీతడేకా వేదపు రహస్యములు
చలమి నీతడే చూపె శరణాగతి
నిలిపినాడీతడేకా నిజముద్రా ధారణము
మలసి రామానుజులు మాటలాడే దైవము ॥గతులన్ని॥

నియమములు ఈతడేకా నిలిపె ప్రపన్నులకు
దయతో మోక్షము చూపె తగనీతడే
నయమై శ్రీ వేంకటేశు నగమెక్కే వాకిటను
దయచూచి మమ్మునిట్టే తల్లిదండ్రి దైవము ॥గతులన్ని॥

**భావామృతం :**

ఈ కలియుగంలో కలి ప్రభావముచే అరిషడ్వర్గముల పాలై దిక్కులన్నీ అంతరించిపోయి గతి ఏదిరా భగవంతుడా అని ఆవేదన చెందుతుంటే నాకు ఈ మహానుభావుడైన శ్రీ ఘనముని గురుదేవుల వారు గొప్పగురుదేవులై దారిచూపించారు.

ఈయన దయవలననే మేము వైష్ణవులమై విష్ణువునాశ్రయించాము. ఈ తిరుమలమణిని ఈయన కృప వలననే చూచితిమి. అష్టాక్షరి మంత్రమని ప్రఖ్యాతిజెందిన 'ఓం నమో నారాయణాయ' అను మంత్రమును ఈ గురువే ఉపదేశించారు. ఇహ పరములు రెంటికీ దైవమైన ఈ ఆచార్యులే శ్రీరామనుజాచార్యుల వారు.

ఈ గురుదేవులే మాకు వేదములలోని తత్త్వరహస్యములనన్నింటినీ తెలియజేసిరి.

కరుణాంతరంగులై మాకు ఆదిదేవుని శరణాగతి పొందుట నేర్పారు. వైష్ణవమత సంప్రదాయబద్ధముగా శంఖచక్రాది ముద్రలను ధరింపజేశారు. ఆపై మాతో శ్రీరామానుజులు జ్ఞానబోధచేసి మాటలాడిరి.

ఈ గురుపుంగవులే శరణాగతి యొక్క నియమములన్నీ మాకు నేర్పారు. ఈ మహానుభావుడే కరుణతో మాకు మోక్షమార్గం చూపారు. అందరినీ, నన్నూ కరుణించినట్లే అనుగ్రహించుటకే శ్రీవేంకటేశ్వరుని కొండను ఎక్కునప్పుడు వాకిటిలోనే నిలిచి మమ్మల్లి ఈవిధముగా దీవించు తల్లీ, తండ్రీ, దైవమూ కూడా ఈ గురుపుంగవులే అయ్యారు.

## 22

## ఘు

**రాగం : పూర్వి కళ్యాణి**

ఘుమ్మనియెడి శృతి కూడగను
కమ్మని నేతులు కాగగ చెలగె ॥ఘుమ్మని॥

నీల వర్ణుడని నీరజాక్షుడని
బాలుని నతివలు పాడేరో
పాలు పిదుకుచును బానల కాగుల
సోలి పెరుగు త్రచ్చుచు చెలరేగె ॥ఘుమ్మని॥

మందరధరుడని మాధవుడని గో-
విందుని పాడేరు వెలదులిదే
నంద వ్రజమున నలుగడ నావుల
మందల పేయల మంచిరవముల ॥ఘుమ్మని॥





వేంకటపతియని వేదనిలయుడని
పంకజనాభుని పాడేరు
అంకుల చేతను అలరు రవంబుల
బింకపు మాటల బృందావనమున ॥ఘుమ్మని॥

**భావామృతం :**

ఘుమ్మనే శృతి బద్ధమైన ధ్వనితో పెద్ద పెద్ద కాగులలో కమ్మని రుచిగల నేతులు కాగుచున్నవి. (గోపాలకృష్ణుని నందవ్రజము శోభలీనింది. ఆ వివరం వినండి...)

గోపభామినులందరూ ఆ గోపబాలుని నీలవర్ణుడని, నీరజాక్షుడని కీర్తించుచు పాడినారు. పాలు పిదుకుచు కొందరు గోపికలు బానలు కాగులు నింపసాగిరి. కొందరు స్త్రీలు పెరుగును సోలి(వివశులైపోయి) చిలుకుచూ చెలరేగి కానసైరి.

గోవిందుడని పేరు గాంచిన ఆ శ్రీకృష్ణుని గోపికలు (వెలదులు) అందరూ మందరగిరి ధరుడని (గోవర్ధన పర్వతమును తన చిటికిన వ్రేలిపై ఎత్తిన వాడని), మాధవుడని పాడి కీర్తించెడివారు. నందవ్రజమున (రేపల్లెలో) నలుదిక్కులా, మంచి ధ్వనిగల ఆవుల మందలను పేయలను (దూడలను) కాచినాడు.

ఇపుడు పద్మనాభుడైన ఆ మహానుభావుని శ్రీవేంకటపతియనియు, వేదములే నిలయముగాగల శ్రీమన్నారాయణుడనియు భక్తితో పాడి జనులు కీర్తించుచున్నారు. ఆ విధముగా బృందావనమున అంకుల చేతను (విశిష్టమైన ఆభరణములు గల చేతులతోను) బింకపు మాటలతోను (గర్వముగల మాటలతో) జగతి విలసిల్లినది.

# 23 జ

ఆ.వె॥ ఎరుగ 'జ' అను వర్ణమిప్పుడు కనరాదు
వాడరిపుడు జనులు భాషయందు
అన్నమయ్యపాట నగపడదుర 'కంట'
వినుత గుణవిలోల వేంకటేశ!

**భావామృతం**

ఈ రోజుల్లో 'జ' అను అక్షరం వాడుకలో లేదు. ఇక అన్నమయ్య కీర్తన 'జ' తో ఆరంభం ఎలా అవుతుంది ఓ శ్రీవేంకటేశ్వరా! సకల సద్గుణాభిరామా! ఇది నిజం.

# 24 చ

**రాగం : నాట**

చక్రమా హరి చక్రమా
వక్రమైన దానవుల వక్కలించవో ॥చక్రమా॥

చుట్టి చుట్టి పాతాళము చొచ్చి హిరణ్యాక్షుని
చట్టలు చీరిన ఓ చక్రమా
పట్టిన శ్రీహరిచేత పాయక ఈ జగములు
ఒట్టుకొని కావగదవొ ఓ చక్రమా ॥చక్రమా॥

పానుకొని దనుజుల బలుకిరీట మణుల
సానలు తీరిన ఓ చక్రమా
నానా జీవముల ప్రాణములు గాచి ధర్మ-
మూని నిలుపగదవొ ఓ చక్రమా ॥చక్రమా॥





వెరచి బ్రహ్మాదులు వేదమంత్రముల నీ
వురుట్లుకొనియాడే రో చక్రమా
అతిముతి తిరువేంకటాద్రీశు వీధుల
ఒరపుల మెరయుదువో ఓ చక్రమా ॥చక్రమా॥

**భావామృతం**

ఓ సుదర్శన చక్రమా! హరిహస్త భూషణమైన పరాక్ర విక్రమా! వక్రబుద్ధిగల రాక్షసులపై తిరుగబడి సంహరించుము. చక్రమా! ఓ చక్రమా! (నిన్ను కీర్తించెదను)

గిరగిర తిరుగుచు పాతాళలోకమున చొరబడి హిరణ్యాక్షుడు అను రాక్షసుని "చుట్టలు తీరిచి" (చంపి) వేసిన చక్రమా! శ్రీహరి తన హస్తమున నిన్ను ధరించగా ప్రతిజ్ఞపూనినట్లు వదలక జగములనెల్ల రక్షించుచున్న సుదర్శనమా! (నీకు సాటిలేరు).

పూనుకొని (ఆరోజుల్లో 'పానుకొని' అనే వారేమో) అసురుల అసంఖ్యాకమైన కిరీటములలోని మణులను సానబట్టిన (సానలు తీరిన) ఓ చక్రమా! అనేకములైన జీవులను (గజేంద్రుని నుంచి అంబరీషుని వరకు) ప్రాణములను కాపాడి ధర్మమును నిలబెట్టినావు గదా! (విష్ణుభక్తుడైన అంబరీషునిపై కోపించి దుర్వాస మహాముని ఒక భూతాన్ని పంపించాడు సంహరించమని భీతిల్లిన అంబరీషుడు శ్రీహరిని శరణు వేడాడు. తన భక్తుని రక్షించుటకు శ్రీహరి తన సుదర్శన చక్రం ప్రయోగించాడు. అది భూతాన్ని క్షణంలో సంహరించి దుర్వాసుని వెంటబడింది. దానినుంచి మునిని రక్షించటం తమవల్ల కాదన్నారు హరుడు బ్రహ్మాది దేవతలు. శ్రీహరికూడా తనపని నెరవేరే దాకా సుదర్శనాన్ని ఆపలేనని అంబరీషునే శరణు వేడమన్నాడు. అంబరీషుడు ప్రార్థిస్తే అప్పుడు శాంతించింది సుదర్శనం. అది అంతగొప్పది)

ఆనాడు భీతిల్లిన బ్రహ్మాది దేవతలు వేదమంత్రాలతో నీ వురట్లు (గొప్పతనం) కొనియాడారు కదా! ఓ చక్రమా సంభ్రమము కలుగునట్లు తిరుమలనాథుని హస్తభూషణమై ప్రతాపముతో బహిర్గతమై మెరిసిపోతున్న సుదర్శనమా! (మమ్ము రక్షింపుము)

# 25 చే

**రాగం : చక్రవాకం**

చందమామ రావో జాబిల్లి రావో మంచి
కుందనపు పైడికోర వెన్నపాలు తేవో ॥చందమామ॥

నగుమోము చక్కనయ్యకు నలువపుట్టించిన తండ్రికి
నిగమములందుండే అప్పకు మా నీలవర్ణునికి
జగమెల్ల ఏలిన స్వామికి చక్కని ఇందిర మగనికి
ముగురికి మొదలైన ఘనునికి మాముద్దుల మురారి బాలునికి॥చందమామ॥

తెలిదమ్మి కన్నుల మేటికి మంచి తియ్యని మాటల గుమ్మకు
కలికి చేతలకోడెకు మా కతలకారి ఈ బిడ్డకు
కులముద్ధరించిన పట్టెకు మంచి గుణములు కలిగిన కోడెకు
నిలువెల్ల నిండవొయ్యారికి నవనిధుల చూపుల చూచే సుగుణునకు ॥చందమామ॥

సురుల గాచిన దేవరకు చుంచు గరుడు నెక్కిన గబ్బికి
నెరవాది బుద్ధుల పెద్దకు మానీటు చేతల పట్టికి
విరుల వింటి వాని అయ్యకు వేవేల రూపుల స్వామికి
సిరిమించు నెరవాది జాణకు మా శ్రీ వేంకటనాధునికి ॥చందమామ॥

**భావామృతం**

ఓ చందమామా! ఇటు వైపుకు ఒక్కసారిరా. చల్లటి జాబిల్లీ (జాను+బిల్లి=జాబిల్లి, అనగా అందమైన పిల్లి, అనగా కుందేలు అంటే... కుందేలు తనలో ఉన్నవాడు, అనగా చంద్రుడు) ఇటు రారాదా! పదియారు వెన్నపూర్తిగా తీయని పాలను మా బాబుకు తీసికొని రారాదా.

మా బాలుడు నవ్వుకవలొలికే ముఖమున్న చక్కనయ్య. బ్రహ్మదేవునికి జన్మనిచ్చిన తండ్రి. వేదములన్నింటిలో కీర్తించబడిన జనకుడు. నీలమేఘచ్ఛాయ గల శరీరం దాల్చిన వాడు జగన్నాధుడు. అందాల బొమ్మ లక్ష్మీదేవికి ప్రియమైన





మగడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అని పిలవబడే ముగ్గురు దేవుళ్ళకు అది దేవుడు. ఇతడే ముద్దులు మూటగట్టే మా మురారి.

సర్వశ్రేష్ఠుడైన వీడు తెల్లని పద్మముల వంటి కన్నులు గలవాడు. మధురమైన మంచి మాటలు మాట్లడే అలంకార ప్రియుడు. ఒయ్యారము లొలుకు మనోజ్ఞమైన చేతలు గల శృంగారమూర్తి (మోహినీదేవి). లెక్కకు మించిన కథలు (పురాణములు) పుట్టుటకు కారణ భూతడైన. వామన మూర్తి. ఆదిత్యకులమును వుద్ధరించిన గుణవంతుడైన బిడ్డ ఈ బాలుడే (రాముడు). ఈ అబ్బాయి సుగుణాలప్రోవు. నవనిధులను ప్రసాదించు వాడు.

ఈ దేవుడే దేవతలందరినీ రక్షించిన వేలుపు. తెల్లటి గరుత్మంతుని అధిరోహించి ఠీవిగానుండే వాడితడే. యుక్తమైన బుద్ధులు గల పెద్దమనిషి కూడ ఇతగాడే. ఇతను చేసే పనులన్నీ తీర్తినట్లుంటాయి. ఈయనెవరనుకున్నారు? స్వయాన మన్మధునికి జన్మనిచ్చినవాడు. అంతేకాదు అనంతమైన (వేలకొద్దీ) రూపములు గలవాడు. ఇదిగో ఈ మా శ్రీ వేంకటేశ్వరుడు అధికముగా ఐశ్వర్యములను ప్రసాదించు జాణ (నేర్పరి).

# 26 ఛ

**రాగం : చక్రవాకం**

ఛీ ఛీ నరులదేటి జీవనము
కాచుక శ్రీహరి నీవె కరుణింతుగాక ॥ఛీ ఛీ॥

అడవిలో మృగజాతియైనా గావచ్చుగాక
వడి నితరుల గొలువగ వచ్చునా
వుడివోని పక్షియై వుండనైనా వచ్చుగాక
విడువకెవ్వరినైనా వేడవచ్చునా ॥ఛీ ఛీ॥

పసురమై వెతలేని పాటు పడవచ్చు గాక
కసటువో నొరుల బొగడగా వచ్చునా
వుసురు మానై పుట్టివుండనైన వచ్చుగాక
విసువక వీరివారి వేసరించవచ్చునా ॥ఛీ ఛీ॥

యెమ్మెల బుణ్యాల సేసి యిల యేలవచ్చుగాక
కమ్మి హరిదాసుడు గావచ్చునా
నెమ్మది శ్రీవేంకటేశ నీచిత్తమే కాక
దొమ్ములు కర్మములివి తోయవచ్చునా ॥ఛీ ఛీ॥

**భావామృతం**

ఛీ! ఛీ! ఈమానవుల దెంత దౌర్భాగ్యమైన జీవితము!! వీరిని ఆ శ్రీహరియే రక్షించాలి కాని ఇక ఎవ్వరి వలన అయ్యేపని కాదు.

అధికారంలో వున్న మానవుల దాస్యంచేసి బ్రతుకుట కంటే అడవిలో ఏ మృగంగానైనా జీవించవచ్చును కదా! అన్యులను కొలువవచ్చునా? శాశ్వతంగా పక్షిగానైన జీవించవచ్చును కాని అదే పనిగా ఎవ్వరినైనా అర్ధించ వచ్చునా?

మానవుడు పశువు వలె నిరంతరం అవిశ్రాంతంగా గడపవచ్చును కానీ, కోరికలతో సిగ్గువిడచి ఇతరులను పొగడవచ్చునా? జీవితాంతం వృక్షమై పడివుండవచ్చును. కాని విసుగుకూడ లేకుండ వారినీ వీరిని దేబిరించవచ్చునా? అది ఎంతమాత్రము మంచిదికాదు.

విశిష్టత కలిగి ఎన్నో పుణ్యములు చేసిన పుణ్యఫలంగా ఈ భూమండలాన్నేల వచ్చును గాక! వివరముతో శ్రీహరిదాసులు అవటం సాధ్యపడుతుందా? ఓ శ్రీ వేంకటేశ్వరా నీ ఇష్టప్రకారం కాక దొమ్మిగాపైనబడే కర్మలను అధిగమించటం అనేది జరుగుతుందా? ఎన్నటికీ జరుగదు.





# 27 జ

**రాగం : లలిత**

జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామ వీరలక్ష్మి
ప్రియురాలవై హరికి బెరసితివమ్మ ॥జయలక్ష్మి॥

పాలజలనిధిలోని పసనైన మీగడ
మేలిమి తామెరలోని మించు వాసన
నీలవర్ణునురముపై నిండిన నిధానమవై
ఏలేవు లోకములు మమ్మేలవమ్మ ॥జయలక్ష్మి॥

చందురుతోడ బుట్టిన సంపదల మెఱుగవో
కందువ బ్రహ్మలగాచే కల్పవల్లివో
అందిన గోవిందునికి అండనే తోడునీడై
వుందానవు మాయింటనే వుండవమ్మ ॥జయలక్ష్మి॥

పదియారు వన్నెల బంగారు పతిమ
చెదరని వేదముల చిగురుబోడి
ఎదుట శ్రీవేంకటేశు నిల్లాలవై నీవు
నిధుల నిలిచే తల్లి నీవారమమ్మ ॥జయలక్ష్మి॥

**భావామృతం**

అమ్మా! జయలక్ష్మీ! వరలక్ష్మి దేవీ! యుద్ధరంగంలో వీర విహారం చేసే సంగ్రామ లక్ష్మీ! నీవు శ్రీమన్నారాయణునకు ప్రియురాలవై అవతరించినావు (సత్యభామగా భావన)

నీవు పాలసముద్రమునుండి వెలువడిన పసందైన మీగడవు తల్లీ! శ్రేష్ఠమైన పద్మము యొక్క పరిమళము కూడ నీవే. నీలమేఘచ్ఛాయతో మెరిసిపోయే శ్రీహరి వక్షస్థలమును ఆక్రమించిన సౌభాగ్యలక్ష్మివి. లోకములనన్నింటిని పరిపాలించు దానివి. అందుచేత మమ్ముకూడా పరిపాలించుము తల్లీ!

దేవదానవులు క్షీరసాగరమును మధించినప్పుడు చంద్రునితో పాటు పుట్టి సంపదలన్నింటికీ నీవే సామ్రాజ్ఞివైనావు. బ్రహ్మాదులను రక్షించే కల్పవల్లివై గోవిందునకు తోడు నీడవు అండదండవూ అయి ఉన్నదానవు. మాగృహమున స్థిరపడు తల్లీ!

పదహారు వన్నెలు గల (నేటి కాలంలో 24 కారెట్లు) బంగారు బొమ్మవు తల్లీ! నీవు స్థిరముగా వేదములన్నింటిలోను కీర్తింపబడిన కుసుమపేశలవు. మా ఎదుట ఇలవేల్పుగా వెలసిన శ్రీవేంకటేశ్వరుని అర్ధాంగివై నీవు నవనిధులని కీర్తింపబడే ఆ సంపదలకు ఆస్థానమై వున్నదానవు. ఓ జగజ్జననీ! మమ్ము మరువకు తల్లీ! మేము పరాయివారముకాము. నీ వారమే నమ్మా!

## 28 జో

**రాగం : నవరోజ**

జోవచ్యుతానంద జోజో ముకుందా
రావె పరమానంద రామగోవింద ॥జోవచ్యుతా॥

నందు నింటను జేరి నయము మీఱంగ
చంద్రవదనలు నీకు సేవచేయంగ
నందముగ వారిండ్ల నాడుచుండంగ
మందలకు దొంగ మా ముద్దురంగ ॥జోవచ్యుతా॥





పాలవారాశిలో పవళించినావు
బాలుగా మునుల కభయమిచ్చినావు
మేలుగా వసుదేవు కుదయించినావు
బాలుడై యుండి గోపాలుడైనావు ॥జోవచ్యుతా॥

అట్టుగట్టిన మీగడట్టె తిన్నాడే
వట్టి కోడలు మూతిపై రాసినాడే
అట్టె తినెనని యత్త యడుగ విన్నాడే
గట్టిగా నిది దొంగ కొట్టుమన్నాడే ॥జోవచ్యుతా॥

గొల్లవారిండ్లకు గొబ్బునకు బోయి
కొల్లలుగ త్రావి కుండలను నేయి
చెల్లునా మగనాండ్రు జెలిగి యీశాయీ
చిల్లతనములు సేయ జెల్లునట వోయీ ॥జోవచ్యుతా॥

రేపల్లె సతులెల్ల గోపంబుతోను
గోపమ్మ మీ కొడుకు మా ఇండ్లలోను
మాపుగానే వచ్చి మా మానములను
మీపాపడే చెఱిచె నేమందుమమ్మ ॥జోవచ్యుతా॥

ఒకని యాలినిదెచ్చి నొకని కడబెట్టి
జగడములు కలిపించి సతిబతుల బట్టి
పగలు నలుజాములును బాలుడైనట్టి
మగనాండ్రచేబట్టి మదనుడైనట్టి ॥జోవచ్యుతా॥

అంగజుని గన్న మాయన్న యిటు రారా
బంగారు గిన్నెలో పాలు పోసేరా
దొంగనీవని సతులు పొంగుచున్నారా
ముంగిటనాడరా మోహనాకారా ॥జోవచ్యుతా॥

గోవర్ధనంబెత్తి గొడుగుగా పట్టి
కావరమ్మున నున్న కంసుపడగొట్టి
నీవు మధురాపురమునేల చేపట్టి
ఠీవితో నేలిన దేవకీ పట్టి ॥జోవచ్యుతా॥

అంగుగా తాళ్లపాకన్నయ్య చాల
శృంగార రచనగా చెప్పెనీ జోల
సంగతిగ సకల సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదనగోపాలా ॥జోవచ్యుతా॥

**భావామృతం**

ఓఅచ్యుతానందా! (అంతులేని ఆనందరూపా!)

జో జో (నిదురపో నాన్నా!) ఓముకుందా! రారా పరమానంద స్వరూపా! రాముని రూపం ధరించిన ఓగోవిందా! జోజో!

నీవు క్షేమంగా నందగోపుని ఇంటికి జేరి చంద్రముఖులైన గోపికలు నీకు సేవ చేయుచుండగా, గొల్లపల్లెలో దొంగవైన మా ముద్దుల రంగన్నా జోజో!

నీవు మునుముందుగా క్షీరసాగరమున శయనించియుంటివి. తరువాత బాలునిగా మారి మునులుకు అభయము నొసంగితివి. తరువాత వసుదేవునకు ద్యోతకమైతివి (దర్శన మొసగితివి) తరువాత రేపల్లెలో గోపాల బాలుడైతివి. అట్టిబాబూ జోజో!

చెక్కులు గట్టిన మీగడ తరకలు కడుపార భుజించినాడు. ఏమియు తెలియని అమాయకురాలైన కోడలి మూతిపై ఆ మీగడ రాసినాడు. అందుచేత అత్త ఆమెని నిలదీసి అడుగగా ఇదిగో నీ కోడలే దొంగతనం నేర్చిన జాణ అని అన్నాడు.అటువంటి అల్లరి పాపా జోజో!





శీఘ్రముగా గొల్లవారిండ్లకు బోయి అక్కడ కుండలలోని నెయ్యి అంతులేకుండా త్రాగాడు. ఈ పిల్లవాడు ఈ ఇల్లాళ్ళను ఈ విధంగా కుఱ్ఱచేష్టలతో ఏడిపించతగునా?

ఆగ్రహించిన కొందరు గోపికలు రేపల్లెలో ఇలా గోడు వినిపించారు. “ఓగోపెమ్మా! మీ కొడుకు రాత్రివేళ మా ఇండ్లకువచ్చి మామానముల నపహరించాడు.వాని నేమనమంటావో చెప్పవమ్మా!

ఒక ఆడదాన్ని (పెళ్ళాన్ని) తెచ్చి ఇంకొక మగవాడికి అంటగడతాడు. దాంతో ఆ స్త్రీమొగుడు వచ్చి పోట్లాట పెట్టుకొంటాడు. మీ పిల్లవాడు పగటి వేళ నాలుగు జాములూ మా స్త్రీలతో కూడి అపర మన్మధుని వలె ప్రవర్తిస్తాడు. అట్టి అల్లరి కృష్ణయ్య గూర్చి ఏమి చెప్పమంటావు?

మన్మధుని కన్న తండ్రివైన మా కన్నా!ఇటురా నాన్నా! నీకోసం బంగారు గిన్నెలో పాలు పోసియుంచాము.నీవు దొంగవని సతులు నిందించుచున్నారు.మన ఇంటి ముంగిటిలో ఆడుకోరాదా తండ్రీ! మోహనరూపా! ఎందుకురా మాటలు పడతావు. (అని యశోద అంటున్నది.)

గోవర్ధనపర్వతమును గొడుగులా పట్టి రక్షించిన వాడవౌ బాలుడా! గర్వముతో విర్రవీగిన కంసుని పట్టి సంహరించిన వాడవైతివి. మధురాపురమును ఏలుట సాగించితివి. ఓదేవకీనందానా! ప్రజారంజకముగా. దానిని పరిపాలించితివి.

తాళ్ళపాక అన్నమాచార్యుల వారు ఈ శృంగార గీతిక రూపంలోని జోలపాటను సకలసంపదలను సిద్ధింపజేయు మంగళముగా తిరుపతిలోని మదనగోపాలుడైన శ్రీవేంకటేశ్వరునికి వినిపించినాడు.

## 29 ఝ

ఆ.వె॥ ఝషము రూపుదాల్చి చంపె 'సోమకు' దొల్లి
వేదరాశి గాచె విష్ణుమూర్తి,
అన్నమయ్య పాట అక్షరము 'ఝ' లేక
సంకటంబు కలిగె వేంకటేశ!

**భావామృతం**

పెద్ద చేప ఆకారము దాల్చి పూర్వం విష్ణుమూర్తి సోమకుడు అను రాక్షసుని సంహరించి వేదములను కాపాడాడు. ఓ శ్రీ వేంకటేశ్వరా! అన్నమయ్య కీర్తనలలో ఝ తో ఆరంభమయ్యే కీర్తన దొరకక ఇబ్బంది కలిగినది.

## 30 ఞ

**రాగం : ధన్యాసి**

జ్ఞానయజ్ఞ మీగతి మోక్ష సాధనము
నానార్ధములు నిన్నే- నడపె మాగురుడు ॥జ్ఞానయజ్ఞ॥

అలరి దేహమనేటి–యాగశాలలోన
బలమై యజ్ఞానపు–పశువు బంధించి
కలసి వైరాగ్యపు–కత్తుల గోసికోసి
వెలయ జ్ఞానాగ్నిలో–వేలిచెమా గురుడు ॥జ్ఞానయజ్ఞ॥

మొక్కుచు వైష్ణవులనే–మునిసభ గూడ పెట్టి
చొక్కుచు శ్రీ పాదతీర్థ–సోమపానము నించి
చక్కగా సంకీర్తన–సామగానము చేసి
యిక్కువతో యజ్ఞముసే–యించెబో మా గురుడు ॥జ్ఞానయజ్ఞ॥





తదీయ గురుప్రసా–దపురోడాశ మిచ్చి
కొదదీర ద్వయమను–కుండలంబులు వెట్టి
యెదలో శ్రీ వేంకటేశు–నిటు ప్రత్యక్షము చేసె
ఇదివో స్వరూప దీక్ష–యిచ్చెను మాగురుడు ॥జ్ఞానయజ్ఞ॥

**భావామృతం**

జ్ఞానయజ్ఞమే బహుసులభమైన మోక్షసాధనమని నిన్ననే మా ఆచార్యులు మాకు చెప్పిమాచే నిర్వహింపజేసినారు. ఆ దీక్షావివరములన్నీ మాకు వారు సెలవిచ్చియున్నారు.

'శరీరము' అనే ఈ యజ్ఞశాలలో, బలమైన 'అజ్ఞానం' అనే పశువును తీసికొనివచ్చి బంధించి,' వైరాగ్యం' అనే కత్తితో దానిని ఖండించి, జ్ఞానము అనే అగ్నిలో మా గురువు గారు దానిని వేల్చినారు.

తదుపరి నమస్కారము వంటి ఉపచారములను గావించుచు పరమభాగవతులైన వైష్ణవులు అనే మునుల సభలో నన్ను జేర్చిరి. పిదప సంతోషముతో మా అందరికీ ' శ్రీపాద తీర్థము' అను 'సోమపానము', సంకీర్తన అనే సామవేదగానమును వినిపించిరి. ఆ విధానమున గురువులు మాచే యజ్ఞమును చేయించినారు.

అటుపిమ్మట మాగురువు గారు ఆయనకు సంబంధించిన పురోడాశము ('హుతశేషము') గురుప్రసాద రూపమున నొసగిరి. కొఱతలేనట్లుగా 'ద్వయము' అను కుండలములను మాకు పెట్టారు.

(శ్రీ మన్నారాయణ చరణౌశరణం ప్రపద్యే, శ్రీ మతే నారాయణా నమః అను ఈ రెండు మంత్రములే నిజమైన కుండలములు) ఆ విధముగా మా ఆచార్యులు మా హృదయముతో శ్రీ వేంకటేశ్వరుని ప్రత్యక్షము సేయించినారు. ఆ విధముగా ఆయన మాకు 'స్వరూపదీక్షను' ఇచ్చారు.

## 31 ట

ఆ.వె॥ టక్కులాడివోలె తన్వి మోహిని ఆయె
అమృతమీయదాయె అసురులకును
అన్నమయ్య పాట అక్షరము 'ట' లేక
సంకటంబు మిగిలె వేంకటేశ!

**భావామృతం**

అసురులను వంచించి దేవతలకు అమృతం పంచి ఇవ్వాలని విష్ణుమూర్తి వగలాడి మోహినీ రూపం ధరించాడు. మోహిని వగలు చూపింది కాని అమృతం ఈయదాయెను. ఓ శ్రీవేంకటేశ్వరా! అన్నమయ్య కీర్తన 'ట' తో మొదలయింది దొరకలేదు. చాలా చిక్కువచ్చింది.

## 32 ఠ

ఆ.వె॥ ఠక్కుడనిరి హరిని దానవులానాడు
సర్వులకును తండ్రి సత్యమిదియె
అన్నమయ్య పాట కాదిలో లేదు 'ఠ'
వేంకటేశ! కలిగె సంకటంబు

**భావామృతం**

శ్రీహరిని రాక్షసులందరూ ఆనాడు ఠక్కుడు, అనగా, మోసగాడు అన్నారు. నిజానికి ఆయన జీవులందరికి తండ్రి. తండ్రికి కొడుకులలోని చెడుని చంపాలని వుంటుంది, అంతే. ఓ శ్రీవేంకటేశ్వరా! ఏ అన్నమయ్య కీర్తనా 'ఠ'తో ఆరంభం కాదు. గొప్ప కష్టం వచ్చింది ప్రభూ!



అ ఆ ఇ ఈ లలో అన్నమయ్య

## 33 డ

**రాగం : ఖమాస్**

డోలాయాంచల డోలాయాం హరే డోలాయాం ॥డోలాయాంచల॥

మీన కూర్మ వరాహ మృగపతి అవతార
దానవారే గుణశౌరే ధరణీ ధర మరుజనక ॥డోలాయాంచల॥

వామన రామ రామ వరకృష్ణ అవతార
శ్యామలాంగ రంగ రంగా సామజవరద మురహరణ ॥డోలాయాంచల॥

దారుణ(తారణ) బుద్ధ కలికి దశవిధ అవతార
శీ ( సీ)రపాణే గోసమాణే శ్రీ వేంకటగిరి కూట నిలయ ॥డోలాయాంచల॥

**భావామృతం**

శ్రీ హరీ! నీకు ఊయలలూపెదను. బాగుగా కదలాడు ఊయలలూపెదను.

మత్స్యరూపుడవై (వేదములను రక్షించితివి), కూర్మరూపుడవై (మంధరగిరి నెత్తితివి), వరాహరూపుడవై ( భూదేవిని కాపాడితివి), మృగేంద్రుని రూపుడవై (నరసింహుని వలో ప్రహ్లాదుని బ్రోచావు), ఓ ప్రభూ! అసురారీ! శౌర్యవంతమైన గుణభూషణా! భూ రమణా! మదనజనకా! నీవు సర్వేశ్వరుడవు.

వామనరూపుడవై (బలిని నిరోధించితివి), శ్రీ రామచంద్రమూర్తివై ( రావణుని తెగటార్చితివి), బలరాముడివై (దారుణమైన బలశాలివైతివి), శ్రీ కృష్ణపరమాత్మవై (వరప్రదాతవైతివి) ఓ మహానుభావా! నల్లని శరీరముకలవాడా! శ్రీ రంగమునేలెడి రంగనాథా! గజేంద్ర సంరక్షకా! మురాసురభంజనా! నీవు అసామాన్యుడవు.

ధర్మవర్తనతో తరింపజేసిన ఓ బుద్ధా! (శాంతి ప్రవర్ధకుడవు), కలికి అవతారుడవై (దుర్జనాంతకుడవు). ఓ సీరపాణే (నాగలి ధరించినవాడా) గోసంరక్షకా! శ్రీ వేంకటగిరి కూటమియైన ఏడుకొండలపై నివాసమైన శ్రీ వేంకటేశ్వరా కదలాడే ఈ డోలికలలో ఊగుతూ మమ్ము ఆదుకోతండ్రీ!

# 34 ఢ

**ఆ.వె॥ ఢక్క మోతతోటి తరుణ రుక్మిణి దెచ్చి**
**పరిణయంబునాడె మురవిరోధి**
**అన్నమయ్య పాట అక్షరము 'ఢ' లేక**
**తిప్పలొచ్చి పడెను తిరుమలేశ!**

**భావామృతం**

శత్రువులందరినీ చిత్తుచేసి, 'ఢక్క' (డప్పులు) మొదలైన వాయిద్యాల ధ్వనులు మారు మ్రోగుతుంటే మురారి అయిన శ్రీకృష్ణుడు రుక్మిణిని పెండ్లియాడాడు. ఓ శ్రీవేంకటేశ్వరా! 'ఢ' తో మొదలయ్యే అన్నమయ్య కీర్తన లభించక చిక్కువచ్చింది స్వామీ!

# 35 ణ

**ఆ.వె॥ 'ణ' యను అక్షరంబు నావూహ మేరకు**
**మొదలు కాదు పదము రాదు, లేదు**
**అన్నమయ్యపాట అక్షరము 'ణ' తోటి**
**కొండలయ్య! లేదు వుండబోదు**

**భావామృతం**

ఓ ఏడు కొండలవాడా! నాకు తెలిసినంత వరకు 'ణ' తో మొదలయ్యే అన్నమయ్య కీర్తన లేదు. ఇంకెక్కడా వుండబోదు. కాబట్టి నీకో నమస్కారం తండ్రీ!





# 36 త

రాగం : మోహన

తత్తాతి గుడి ధిం ధిం తకధింధిం
తిత్తి తిత్తి తి తితి తితి తితి ॥తత్తాతి॥

దానవదన వితాన దాన సం-
ధానరుధిర నిజపాన మిదం
నానాభూతగణానాం గానం
దీనజనానాం తిత్తితి తితి తితి ॥తత్తాతి॥

విమత దనుజమత విభవపరిభవిత
సమధికం తవ శౌర్య మిదం
ప్రమదా భవ్యం ప్రమాదాభరణం
తిమిర నిరసనం తిత్తితి తితి తితి ॥తత్తాతి॥

తిరువేంకటగిరి దేవ నిధానం
పరమామృతరస భాగ్యమిదం
కరుణావరణం కమలా ఘటనం
తిరో తిరో తిత్తితి తితి తితి ॥తత్తాతి॥

**భావామృతం**

తత్తాతిగుడి ధిం ధిం తక ధిం ధిం
తిత్తి తిత్తితి తితి తితి తితి

ధారాళముగా కారుచున్న ' చొంగ' తో కలిసిపోయిన రక్తమునంతయూ వచ్చింది వచ్చినట్లే త్రాగివేయుచున్నవాడీ నరసింహుడు. రకరకములైన జీవగణములు అన్నియూ కీర్తించి పాడుచున్నారు. దీనజనులు తిత్తి తిత్తి అని నర్తించుచున్నారు.

శత్రువులైన రాక్షసుల యొక్క వైభవమును దారుణంగా అవమానించు శౌర్యము కలవాడీ నరసింహుడు దానవులను అజ్ఞాన తిమిరములావహించగా వారికి సంతోషముతో కలిగే ఏమఱుపాటును నిరసించే ఆయన ప్రతాపమే తిత్తితి తితి.

ఇది తిరువేంకటపతి పుణ్యనిలయము.‘ పరము’ అనే అమృతం పొందే భాగ్యం ఇక్కడ కలుగుతుంది. ఇది దయావృష్టికి నెలవు. లక్ష్మీదేవికి ప్రియమైన స్థానం ఈ మహానుభావుని హృదయమే. తిరో తిరో తిత్తితి తితి.

# 37 థ

**ఆ.వె॥ ‘థ, ణ’, ల తోటి యే పదము లేదు తెలుగులో**
**యే నిఘంటువునందు కానరాదు**
**పాటయెట్లునుండు పద కవీ అన్నయ్య!**
**తిరుమలయ్య గీతి తెలుపుటెట్లు?**

**భావామృతం :**

ఓ తిరుమల నాయకా! తెలుగులో వున్న నిఘంటువులన్నీ తిరుగ వేశాను. ‘థ, ణ’ లతో ఆరంభమయ్యే మాటే దొరకలేదు. ఇక పాట ఎట్లు వుంటుంది? పద కవితా పితామహా! అన్నమాచార్యా!

# 38 ద

**రాగం : శంకరాభరణం**

దనుజులు గనిరి తత్త్వమిది
వనజాక్షుని కృప వసించ నేలా! ॥దనుజులు॥





హరి పరమాత్ము డనాది పురుషుడు
సురులకు నరులకు సులభుడు
హరి కోపముతో నన్యుల వరములు
సరిగా వెంచగ జగములలోన! ॥దనుజులు॥

వేదాంత విదుడు విష్ణుడు కృష్ణుడు
శ్రీదేవికి బతి శేఖరుడు
పోది బరస్తుతి పుణ్యముకంటే
పాదుగ హరి దిట్టే పాపము మేలు! ॥దనుజులు॥

నారాయణు డున్నతు డచ్యుతు డుప-
కారుడు శ్రీవేంకటవిభుడు
చేరి యీతడే శిక్షించ రక్షించ
వూర దయివములు వొగి నితని సరా! ॥దనుజులు॥

**భావామృతం :**

(ఓ మానవులారా! సురులు విష్ణుభక్తులనే భ్రమతో అసురులు విష్ణు విరోధులయ్యారు. విష్ణుభక్తులను హింసించి, పాపకార్యాలు చేసి హరిచే శిక్షింపబడ్డారు. అందువల్ల మరింత హరిని ఎదుర్కొనటానికి అన్యదేవతల కోసం తపస్సు చేసి వరాలు పొంది హరితోపోరి, హరిచేతిలో నశించి ఇదివరకు తాము హరి నిందతో మూటగట్టుకొన్న పాపం నశించి, పుణ్యంతో వైకుంఠం పొందారు. ఆ దనుజులకు అన్యదేవతల మేలుకంటే హరి చేసిన కీడే పరమ సుఖాన్నిచ్చింది. అవునా?) దనుజులు ఈ విచిత్రమైన తత్త్వమును ఆకళింపు చేసికొనిరి. వనజాక్షుడు (పద్మనయనుడు) అయిన శ్రీహరి కృపతో వసించనేలా! (మనము వుండటమెందుకు?)

నిజం ఆలోచిస్తే, శ్రీహరి పరమాత్ముడు, ఆదిపురుషుడు. ఆయన సురులకు, నరులకు, సులభుడు (సులభంగా వరములిచ్చే పక్షపాతి) అని భావించి, హరిపై కోపముతో ప్రపంచంలో అన్యుల (ఇతర దేవతల) వరములను యెంచగా (పొందాలనుకోవటం) సరికాదు. (అదివారికి హానికరమే అవుతుంది).

వేదాంతుల చేత తెలుపబడినవాడే కృష్ణుడయిన (నీలవర్ణుడైన) విష్ణువు. ఆయనే శ్రీలక్ష్మీ వల్లభుడు, అత్యున్నతుడు. పరస్తుతి చేసి (అన్య దేవతలను కీర్తించి) పోది (పోగుచేసికొనిన) పుణ్యము కంటే, పాదుగా (నిలచి) శ్రీహరిని తిట్టే పాపమే మేలు. (చివరికి అది విష్ణుపురిని ప్రాప్తింప చేస్తుంది)

శ్రీమన్నారాయణుడు ఉన్నతమైనవాడు. నాశనములేని అచ్యుతుడు. ఎంతో ఉపకారము చేయువాడు. ఆయనే శ్రీవేంకటేశ్వరుడు. ఆయన నాశ్రయించినచో మనం చేసికొన్న పాపపుణ్యాలను బట్టి, శిక్షిస్తాడో రక్షిస్తాడో ఆయన ఇష్టం. అంతేకాని, వూరినిండా లెక్కకు, మిక్కుటంగా క్రమముగా వుండే ఇతర దేవతలెందుకు? వారు ఈ ఏడుకొండలవాడితో సమానమా?

## 39 ధ

**రాగం : దేసాళం**

ధరణినెందరెన్ని – తపములు చేసినాను
హరికృప గలవాడే – అన్నిటా బూజ్యుడు ॥ధరణి॥

మితిలేని విత్తులెన్ని – మేదినిపై జల్లినాను
తతితో విత్తినవే – తగ బండును
ఇతర కాంతలు మఱి – యెందరు గలిగినాను
పతి మన్నించినదే – పట్టపు దేవులు ॥ధరణి॥





పాలుపడి నరులెన్ని –పాట్లుబడి కొలిచినా
నేలిక చేపట్టిన వాడే –యెక్కుడు బంటు
మూలనెంత ధనమున్నా – ముంచి దాన ధర్మములు
తాలిమితో నిచ్చినదే – దాపురమై నిల్చును ॥ధరణి॥

ఎన్నికకు గొడుకులు – యెందరు గలిగినాను
ఇన్నిటా ధర్మపరుడే – యీడేరును
ఉన్నతి జదువులెన్ని – వుండినా శ్రీవేంకటేశు
సన్నుతించిన మంత్రమే – సతమై ఫలించును ॥ధరణి॥

**భావామృతం**

ఈ లోకంలో యెందరెన్ని తపస్సులు చేసినప్పటికీ, హరికృప పొందినవాడు మాత్రమే అన్నింటిలోను పూజకు అర్హుడు.

తతితో (అదనుతో) విత్తనాలు భూమిలో నాటకుండా యెన్ని విత్తనాలు చల్లినా లాభమేముంది? బాగుగా దున్నిన నేలలో అదను చల్లిన విత్తనమే మొలకెత్తుతుంది. ఒకరాజు చేరదీసిన స్త్రీలెంత మంది వున్నా అతని మన్నింపు పొందినది మాత్రమే పట్టపు రాణిగా పరిగణించబడి రాజ్యాన్నేలుతుంది.

ఒక ఏలిక (ప్రభువు) వద్ద యెంతమంది భృత్యులు వూడిగం చేస్తున్న వారంతా పాలుపడి, పాట్లుపడి కొలిచినా వ్యర్థమే. ఆయన నమ్మిన బంటు మాత్రమే ముఖ్యమైన అధికారి అవుతాడు. తక్కినవారంతా జీతం తీసికొనే పనివాళ్ళు మాత్రమే. మూలనెంత ధనం వున్నా ( ఆరోజుల్లో ధనవంతులు ఇంట్లో వొక మూల త్రవ్వి, బిందెల్లో నాణెముల రూపంలో వున్న ధనం పోసి, ఒక వస్త్రంతో మూసికట్టి, పాతిపెట్టి దాచి వుంచేవారు. ఒక బిందెకు ఇంకొక బిందెకు 'లంకె' వేసి ఇంకో తాడు కట్టేవాళ్లు. అవి వాళ్లకి ఉపయోగపడక ఆ తరువాత యెవరికో దొరికి వారికి వుపయోగపడేవి. అవే

'లంకెబిందెలు' అనేవారు. అది నిరుపయోగమే. తాలిమితో (శ్రద్ధతో), ముంచి (అతిశయించి) దానధర్మం చేసినది మాత్రమే దాపరమై (ప్రాప్తమై) జన్మాంతరములలో అక్కరకొచ్చును.

ఎన్నికకు (లెక్కించుటకు) ఎంతమంది కొడుకులున్నా వాళ్లు నిరుపయోగులే. ఇన్నిటా (ఇందరిలోనూ) ధర్మవర్తనుడు మాత్రమే ఈడేరుతాడు (తల్లిదండ్రిని, కడతేరుస్తాడు) అహో!! అన్నమాచార్యా! ఆరువందల ఏళ్లక్రిందనే, ఎంత సత్యం చెప్పావయ్యా!) ఉన్నతమైన చదువులు యెన్నివున్నా శ్రీవేంకటేశ్వరుని సన్నుతించె మంత్రం (ఓం నమో వేంకటేశాయ) ఒక్కటే సతమైన (శాశ్వతమైన) ఫలితాన్నిస్తుంది. తక్కినవన్నీ వ్యర్థమైన చదువులే అవి బిరుదులవలె పేరు వెనకాలో ముందరో తగిలించుకోటానికి తప్పించి ఆ స్వామి కరుణ పొందటానికి అస్సలు... ఉపయోగపడవు)

## 40 న

**రాగం : శ్రీరాగం**

నమో నారాయణాయ
నారాయణాయ సగుణ బ్రహ్మణే సర్వ
పారాయణాయ శోభనమూర్తయే ॥నమో॥

నిత్యాయ విబుధ సంస్తుత్యాయ నిత్యాధి-
పత్యాయ మునిగణప్రత్యయాయ
సత్యాయ ప్రత్యక్షాయ సన్మానస సాం-
గత్యాయ జగదవన కృత్యాయ తే నమో ॥నమో॥



అ ఆ ఇ ఈ లలో అన్నమయ్య

అక్రమోద్ధత బాహు విక్రమాతిక్రాంత
శుక్ర శిష్యోన్మూలనక మాయ
శక్రాది గీర్వాణ వక్రభయ భంగ నిర్
వక్రాయ నిహతారి చక్రాయతే నమో ॥నమో॥

అక్షరాయాతి నిరపేక్షాయ పుండరీ
కాక్షాయ శ్రీవత్సలక్షణాయ
అక్షీణ విజ్ఞాన దక్ష యోగీంద్ర సం
రక్షానుకంపా కటాక్షాయ తేనమో ॥నమో॥

కరిరాజవరదాయ కౌస్తుభా భరణాయ
మురవైరిణే జగన్మోహనాయ
తరుణేందు కోటీర తరుణీ మనస్తోత్ర
పరితోషచిత్తాయ పరమాయతేనమో ॥నమో॥

పాత్రదానోత్సవ ప్రథిత వేంకటరాయ
ధాత్రీశకామితార్థప్రదాయ
గోత్రభిన్మణిరుచిర గాత్రాయ రవిచంద్ర
నేత్రాయ శేషాద్రి నిలయాయ తే నమో ॥నమో॥

**భావామృతం :**

ఓ నారాయణుడా! నీకు వందనములు. సుగుణములకు నెలవైన పరబ్రహ్మ స్వరూపుడవు నీవు. సర్వమూ నేర్చినవాడవు. నీవు సుందరమూర్తివి. అట్టి నీకు వందనము. ఓ మహానుభావా! నీవు నిత్యము వుండెడివాడవు. గొప్ప పండితులచే చక్కగా స్తుతింపబడువాడవు. మునిజనుల నమ్మకమైన వాడవు. సత్యస్వరూపుడవు.

ప్రత్యక్షముగా కరుణించువాడవు. సద్బుద్ధిగల వారి సాంగత్యాభిలాషివి. జగత్తు నంతటిని తృప్తిపరచువాడవు. అటువంటి నీకు నమస్కారములు.

ఓ దేవదేవా! అన్యాయం పెట్రేగినప్పుడు నీ బాహువుల పరాక్రమముచే దాని నెదిరించువాడవు. శుక్రాచార్యుని శిష్యులైన దైత్యులను నిర్మూలించు నియమము కలవాడవు. ఇంద్రాది దేవతలకు అతిశయించిన భయమును నిర్మూలించిన వాడవు. ఏ విధమైన వక్ర స్వభావమూ లేనివాడవు. శత్రువులను తరుగు చక్రము గలవాడవు. అట్టి నీకు వందనములు.

ఓ లోకేశా! నీవు నాశనము లేనివాడవు. ఏ కోరికలూ లేనివాడవు. పద్మదళ నేత్రుడవు. శ్రీవత్సమును పుట్టుమచ్చ నీ లక్షణముగా కలవాడవు. ఎన్నడూ క్షీణించని విజ్ఞాన దక్షత కలవాడవు. విశిష్టులైన యోగులను రక్షించి మిక్కిలి కరుణతో అనుగ్రహించువాడవు. అట్టి నీకు నమస్కారములు.

ఓ స్వామీ! నీవు అలనాడు గజేంద్రుని కాపాడినవాడవు. దివ్య కౌస్తుభమణి చేత అలంకరింపబడిన వాడవు. 'ముర' అను రాక్షసుడు శత్రువుగా కలవాడవు. జగన్మోహనుడవు. లే వెన్నెల వెలుగులు విరజిమ్ము కిరీట ధారివి. లేబ్రాయపు గోపికలచే కీర్తించబడి మిక్కిలి సంతుష్టాంతరంగుడవై కైవల్యము నొసగినవాడవు. అట్టి నీకు వందనములు.

ఓ జగన్నాథా! నీవు పాత్రులకు వారికి తగినవి అనుగ్రహించుటలో ప్రసిద్ధిజెందిన శ్రీవేంకటేశ్వరుడవు. మానవుల కామితములను దీర్చువాడవు. వివిధ దివ్య రత్నములచే బొడమిన కాంతులచే ప్రకాశించు దేహము కలవాడవు. శేషాద్రి నిలయమైనవాడవు. అటువంటి ఓ పరమపురుషా! నీకు శతకోటి వందనములు.





# 41 ప

**రాగం : అభేరి**

పలుకు తేనెల తల్లి పవళించెను
కలికి తనముల విభుని కలసినదిగాన ॥పలుకు॥

నిగనిగని మోముపై నెఱులు గెలకుల చెదర
పగలైనదాక చెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారినదాక
జగదేకపతి మనసు జట్టిగొనె గాన ॥పలుకు॥

కొంగు జాఱిన మెఱుగు గుబ్బలొలయగ తరుణి
బంగారు మేడపై పవళించెను
చెంగలువ కనుగొనల సింగారములు దొలక
అంగజగురునితోడ అలసినది గాన ॥పలుకు॥

మురిపెంపు నటనతో ముత్యాల మలగుపై
పరవశంబున తరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌగిట గలసి
అరవిరై నును చెమట నంటినదిగాన ॥పలుకు॥

**భావామృతం**

తేనెలూరు తీయని పలుకులు మాట్లాడే అలమేలు మంగమ్మ తల్లి నిదురించుచున్నది. స్త్రీకి పరిపూర్ణత్వమును కలిగించే పతితో రతిపై ఆసక్తి కలిగిన ఆమె తన వల్లభునితో సంగమించినది.

నిగనిగమని ప్రకాశించు ముఖముపై ముంగురులు చెదిరి ఆడుచున్నవి. పగలైపోయినా ఆమె పవళించియే ఉన్నది. అంతులేని ప్రావీణ్యముతో ఆ తల్లి, జగదీశ్వరుడైన తన పతి మనసును ఆకట్టుకొని యున్నది. కావున బడలి శయనించుచున్నది.

ఆమె పయ్యెద స్థాన భ్రంశమునందగా మెఱయు స్తనయుగ్మము విస్తరించి యున్నవి. ఆ భామామణి బంగారపు మేడపై నిదురించుచున్నది. ఎఱ్ఱ కలువల వంటి సోగ కన్నులలో శృంగారం అతిశయించి ఆమె మదనుని జనకునితో మన్మధ యుద్ధమున అలిసిపోయియున్నది. అందుచే ఆ తల్లి నిదురించుచున్నది.

మురిపెము లొలుకు అభినయం చూపిన ఆ తల్లి ముత్యాల హంసతూలికా తల్పంపై పరవశురాలై పవ్వళించి యున్నది. తిరుమలాధీశుడైన శ్రీవేంకటపతి కౌగిటిలో కరిగిపోయిన ఆ తల్లి అరవిచ్చిన మొగ్గవలె చిరుచెమటలు కమ్మి శయనించుచున్నది.

## 42 ఫ

**రాగం : శ్రీరాగం**

ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లతా-
కేలీ విహార లక్ష్మీనారసింహ ॥ఫాలనేత్రా॥

ప్రళయ మారుత ఘోర భస్మికా పూత్కార-
లలిత నిశ్వాస డోలా రచనయా
కులశైల కుంభీనీ కుముదహిత రవి గగన-
చలన విధి నిపుణ నిశ్చల నారసింహా ॥ఫాలనేత్రా॥





వివరఘన వదన దుర్విధిహసన నిష్ఠ్యూత-
లవదివ్య వరుష లాలా ఘటనయా
వివిధ జంతువ్రాత భువన మగ్నీకరణ
నవనవ ప్రియ గుణార్ణవ నారసింహా ॥ఫాలనేత్రా॥

దారుణోజ్జ్వల ధగద్ధగిత దంష్ట్రానల వి-
కారస్ఫులింగ సంగక్రీడయా
వైరిదానవ ఘోర వంశ భస్మీకరణ
కారణ ప్రకట వేంకట నారసింహా ॥ఫాలనేత్రా॥

**భావామృతం**

ఈ అహోబల నరసింహుడు నుదుట వహ్నినేత్రుడైన లక్ష్మీనరసింహుడు, బలీయమైన మెరుపుతీగెల వంటి కాంతులు ప్రస్ఫుట మవుచుండగా కేళి విహారమును సలుపుచున్నవాడు.

ప్రళయకాలము నాటి ఝంఝామారుతములు వీచుచుండగా భస్మీపటలమొనర్చు ఘోరమైన పూత్కారము సలుపుచూ అంతలోనే లలితమైన ఉచ్ఛ్వాస నిశ్వాసముల డోలలూపుచుండగా ఆవృతంబైన కులపర్వతములను, భూమ్యాకాశములను, సూర్యచంద్రులను ఉయ్యాలలూపు చున్నప్పటికీ, తను నిశ్చలంగా వుండే నైపుణ్యం కలవాడీ లక్ష్మీనరసింహుడు.

విస్తరించిన పెద్ద ముఖమున భీకరాట్టహాసము ప్రకటించుచుండగా ధారగా లాలాజలము రాశిగా కారుచుండగా అనేకములైన జీవులను కలిగిన ప్రపంచమును అగ్నికీలలలో భస్మీపటల మొనర్చుచు అరుదైన కొంగ్రొత్త గుణ సముద్రుడై ఈ లక్ష్మీనరసింహుడు ప్రకటితమైనాడు.

ధగధగమని మెరయుచున్న భీకరమైన కోరలనుండి దారుణమైన

స్ఫులింగములు (నిప్పురవ్వలు) వెలువడి క్రూరులైన దానవులను, వారి వంశములను బూడిదపాలు చేయుచుండగా ఆ వినాశనమునకు కారణమై ప్రకటింపబడిన ఈ నరసింహుడు వేరెవ్వరో కాదు, ఆ వేంకటేశ్వరుని తొలిరూపమైన వేంకట నారసింహుడు.

(అందుకనే ఆంధ్రదేశంలో వేంకట నారసింహుని పేరు పెట్టుకొన్న వెంకట నరసయ్యలు లెక్కకు మిక్కుటంగా వున్నారు.)

## బ

## 43

**రాగం : ధన్యాసి**

బండి విరిచి పిన్న పాపలతో నాడి
దుండగీడు వచ్చె దోబూచి ॥బండి విరిచి॥

పెరుగు వెన్నలు ప్రియమున వే-
మరుముచ్చిలించు మాయకాడు
వెరుపున దన విధము దాచుకొని
దొరదొంగ వచ్చె దోబూచి ॥బండి విరిచి॥

పడుచు గుబ్బెత పరపుపై పోక-
ముడి కొంగు నిద్ర ముంపునను
పడియుతా (?) వద్ద పవళించినట్టి
తొడుకుదొంగ వచ్చె దోబూచి ॥బండి విరిచి॥

గొల్లపల్లెలో ఇల్లిల్లూ చొచ్చి
కొల్లలాడిన కోడెగాడు
యెల్లయినా వేంకటేశుడు ఇదె
తొల్లిటి దొంగ వచ్చె దోబూచి ॥బండి విరిచి॥





**భావామృతం**

(దుండ గీడు అంటే దుష్టుడు. అంటే 'కీడు' చేసే వాడు అని అర్థం. ఆదిదేవుణ్ణి అంతటి మాట ఎందుకంటున్నారు అన్నమయ్య? గోపెమ్మల్లాగా, మనబోటి సామాన్యుల్లాగా ఆలోచించే వారికి స్వామి లీల అర్థమవుతుందా? ఆయన ఎవ్వరికీ కీడు చేయడు.మన కర్మఫలమే మనకిచ్చినా, అది మన కంటికి కీడులాగే కనిపిస్తుంది. అదే మాయ. ఆ మాయగాణ్ణి దొంగ అంటున్నారు అంతా.... నిజానికి దొంగలెవరు?)

బండి విరిచి పిల్ల పాపలతో ఏవేవో దొంగాటలాడే దుండగీడు వస్తున్నాడు. జాగ్రత్త దోబూచి. (దోంగ భూతం) వస్తాడు.

అతి ఇష్టంగా పెరుగు వెన్నలను మాటిమాటికీ దొంగతనం చేసే మాయలమారివాడు ఈ కుర్రవాడు. ఉపాయంతో తన విధానమేమియో తెలియనీయని ఈ దొరదొంగ (దొంగవలె భ్రమింపచేసే సర్వేశుడు) వచ్చాడు. జాగ్రత్త దోబూచి.

చక్కటి స్తనములున్న (గుబ్బెత) పడుచుపిల్ల పరుపు మీద నిద్ర పోతుంటే చీరముడి ఊడతీసి ఆమె ప్రక్కనే పడుకొన్న దొంగవచ్చాడు, తొడుకు (ఒడిసి పట్టుకొండి). జాగ్రత్త. దోబూచి.

రేపల్లెలో ప్రతి ఇంటిలోను దూరి, ఆ ఇంట్లో వెన్నలను కన్నెలను కొల్లగొట్టిన వాడే ఈ కోడెవయసు కుర్రవాడు. వీడు అన్నీ తానే అయిన శ్రీ వేంకటేశ్వరుడే. ఇదిగో ఈయన అనాదిగా భక్తుల హృదయాలను దొంగతనం చేస్తున్న పెద్ద దొంగ. జాగ్రత్త!! దోబూచి వస్తున్నాడు. బాబోయ్. జాగ్రత్త!

# 44 భ

**రాగం : రామక్రియ**

భక్తి కొలది వాడే-పరమాత్ముడు
భుక్తి ముక్తి దానె యిచ్చు- భువి పరమాత్ముడు ॥భక్తి॥

పట్టిన వారి చే బిడ్డ-పరమాత్ముడు
బట్ట బయటి ధనము-పరమాత్ముడు
పట్టపగటి వెలుగు-పరమాత్ముడు
ఎట్టయెదుటనే వున్నా-డిదే పరమాత్ముడు ॥భక్తి॥

పచ్చిపాలలోని వెన్న-పరమాత్ముడు
బచ్చెన వాసిన రూపు-పరమాత్ముడు
బచ్చు చేతివొరగల్లు-పరమాత్ముడు
ఇచ్చకొలది వాడు పో-యీ పరమాత్ముడు ॥భక్తి॥

పలుకులలోని తేట-పరమాత్ముడు
పలియించు నిందరికి -పరమాత్ముడు
బలిమి శ్రీవేంకటాద్రి -పరమాత్ముడు
ఎలమి జీవుల ప్రాణ-మీపరమాత్ముడు ॥భక్తి॥

**భావామృతం :**

పరమాత్మకు మనపట్ల కలిగే కరుణయెప్పుడూ మనభక్తికి తగ్గట్లుగానే వుంటుంది. జీవులకు భుక్తి ముక్తి రెండూ ఇచ్చేవాడు ఆ పరమాత్ముడు దక్క వేరెవ్వరూ కాదు.

పరమాత్మ 'పట్టినవారిచే బిడ్డ'. అంటే ఎవరు ఎత్తుకొంటే వారి దగ్గరకు వెళ్ళే బిడ్డవలె ఎవరు నాకు నీవే కావాలి తండ్రీ! అంటే వారిని కరుణిస్తాడు. పరమాత్మ బట్టబయలు చేసుకోగలిగిన ధనం (వైట్ మనీ అన్నమాట). గుప్తధనంకాదు. పరమాత్మ ఆరుబయట పట్టపగలు కనబడే సూర్యకాంతి వంటివాడు. కృత్రిమంగా వెలిగించిన దీపంకాదు. పరమాత్మ వేరెక్కడనో లేడు, మన యెట్టయెదుటనే వున్నాడు. (మనపుణ్యం కొఱవైనందువలన మనకు కనిపించడు. అంతే...

వెచ్చజేయని పచ్చిపాలలో దాగియున్న వెన్నవలె ఆ పరమాత్మ అణువణువులో వున్నాడు. పరమాత్మ 'బచ్చెనబాసిన రూపు' అనగా ఏవిధమైన పైపూతల వంటి మెఱుగులు లేని నిజస్వరూపుడు. పరమాత్మ బచ్చు (వైశ్యుడు) చేతిలోని 'వొరగల్లు' అనగా గీటురాయి. (అన్నమాచార్యుల కాలంలో వైశ్యులే నేటికాలంలో స్వర్ణకారులు చేసే పనికూడా నిర్వహించేవారు). ఎవరిదెంత నిజమైన భక్తియో ఆ గీటురాయికి తెలియకుండా వుంటుందా? మన ఇచ్ఛ (కోరిక) కొలది ఆయన మనని అనుగ్రహిస్తాడు.

పరమాత్మ పలుకులలోని తేట. అనగా వేదవేదాంగము లన్నింటిలోని వాక్యములలోని భావస్వరూపుడు. ఇంతమంది జీవులకు స్వపరభేదం లేకుండా "చేసికొన్నవారికి చేసికొన్నంత" ఫలితం ఇచ్చే న్యాయమూర్తి. ఈయనే శ్రీవేంటాద్రిపై వెలసిన పరమాత్ముడైన శ్రీవేంకటేశ్వరుడు. ఈయన అనుపమ శక్తి సంపన్నుడై వాత్సల్యంతో జీవులందరిలోను ప్రాణరూపంలో వున్న పరమాత్మ.

# 45 మ

**రాగం : అభోగి**

మనుజుడై పుట్టి మనుజుని సేవించి
అనుదినమును దుఃఖ మందనేల ॥మనుజుడై॥

జుట్టెడు కడుపుకై చొరని చోట్లు చొచ్చి
పట్టెడు కూటికై బతిమాలి
పుట్టిన చోటికే పొరలి మనసు వెట్టి
వట్టి లంపటము వదలనేరడు గాన ॥మనుజుడై॥

అందరిలో పుట్టి అందరిలో పెరిగి
అందరి రూపము లటు తానై
అందమైన శ్రీవేంకటాద్రీశు సేవించి
అందరాని పదము అందెనటు గాన ॥మనుజుడై॥

**భావామృతం :**

ఓ మానవులారా! ఏమిటీ విచిత్రం!! మానవుని వలె జన్మించిన వాడు, ఇంకొక మానవుని సేవించడమేమిటి? పోనీ దానివలన ఏమన్నా సుఖపడుతున్నాడా అంటే లేదే!! ప్రతి దినము దుఃఖిస్తూనే వున్నాడు. మరి ఇక ఇదంతా యెందుకు? ఆలోచించండి.

సరే! తిండికోసం పడరాని పాట్లు పడవలసి వస్తోంది అనుకుంటే, మన కడుపు యెంత వుంది? జుట్టెడు (జానెడు కడుపు). దీనికోసం చొరరాని చోట్లు (వెళ్లకూడని స్థలములకు) చొచ్చి (వెళ్ళి), అవస్థలు పడుతున్నాడు. పట్టెడు కూటికోసం (పిడికెడు తిండికోసం) ఎవరెవర్నో బ్రతిమిలాడి, భంగపడి, మనస్సంతా తనుపుట్టిన చోటుపైనే పెట్టి, ప్రవర్తించి, వుపయోగపడని లంపటాలను (తగులుకొన్న బాంధవ్యాలనే ఊంపిని) వదలనే లేదు. కాబట్టి వీడు మనిషై పుట్టి సాధించినదేమిటి? శుద్ధ దండుగే కదా!

ఇక ఈ మానవ జన్మలో వీడు చేసిన అకృత్యాలవల్ల యేం జరుగుతున్నదో చూడండి. వీడు (ఈ ఆత్మ) మళ్ళీ అందరిలోనూ పుడుతున్నాడు. కాబట్టి అందరిలోనూ పెరుగుతున్నాడు. ఆ హీనజన్మల రూపములన్నీ తానే అవుతున్నాడు. ( ఈ దీక్షితులు యెక్కడో ఏ గాడిద జన్మనో పొందుతాడనే ఆలోచనే... కంపరం కలిగిస్తున్నది కదా!)





మరి యెందుకండీ ఈ తిప్పలు? మనోజ్ఞమూర్తియైన ఆ స్వామిని, శ్రీవేంకటేశ్వరుని సేవించి, మానవులకు అందరాని కైవల్య పదవ నందుకొనుటకు ప్రయత్నించాలి, కానీ వ్యర్థజీవితం గడుపవచ్చునా?

# 46 య

**రాగం : ఖమాస్**

యజ్ఞమూర్తి యజ్ఞకర్త యజ్ఞభోక్త విన్నిటాను
యజ్ఞాది ఫలరూప మిటు నీవై వుండవే ॥యజ్ఞ॥

పరికించ జీవులకు ప్రాణమవైన నీకు
నిరతి ప్రాణ ప్రతిష్ఠ నేము సేసేమా
మరిగి మా పూజలంది మమ్ము గాచెడి కొరకు
హరి నీ మూర్తి ప్రాణమావహించవే ॥యజ్ఞ॥

జగతికి నీ పాద జలమే సంప్రోక్షణ
జిగి నీకు సంప్రోక్షణ సేయువారమా
పగటున నన్ను నేడు పావనము సేయుటకు
అగు పుణ్యతీర్థముల అభిషేకమందవే ॥యజ్ఞ॥

వేదములు తెచ్చిన శ్రీవేంకటేశ నేము నీకు
వేద మంత్రముల పూజావిధి సేసేమా
యీ దెస నీ దాసులమైన మమ్ముగాచుట కొరకు
వేదమూర్తివై యిందే విచ్చేసి ఉండవే ॥యజ్ఞ॥

భావామృతం

స్వామీ! యజ్ఞమూర్తివి, యజ్ఞ భోక్తవు, యజ్ఞకర్తవు, ఆ యజ్ఞఫలప్రదాతవు కూడా నీవే. ఇవన్నీ నీవై వుండగా ఇంకా భగవంతుడవు నీవు కాక మరెవ్వరు?

మేమెంత బుద్ధిహీనులమయ్యా!! పరికించి చూస్తే జీవులన్నిటిలోనూ ప్రాణం రూపంలో వున్నదెవ్వరు? నీవే. అట్టి నీకు ఏము(మేము) నిరతితో (అత్యంతాసక్తితో) ప్రాణ ప్రతిష్ఠ చేసి పూజిస్తున్నాము. నీకు ప్రాణమివ్వటానికి మేమెవ్వరం తండ్రీ! అయినా మమ్మల్ని క్షమించి మా పూజల్ని స్వీకరించటానికి మమ్మల్ని రక్షించటానికి ఈ మూర్తి రూపాల్లో ప్రాణ రూపంలో ఆవహించివుండు ప్రభూ!

ఈ సమస్త సృష్టికీ నీపాద జలమైన గంగానది, దాహం తీరుస్తున్నది. దాన్ని సంప్రోక్షించుకొని (నెత్తిపై చల్లుకొని) మేము పాపవిముక్తులమవుతున్నాము. కాని మేము జిగితో (గొప్పగా) నీకు సంప్రోక్షణచేసి పూజిస్తున్నాము. ఇది ఎంత అవివేకమైన పని? అయినా నేడు నన్ను సగటున (బాహాటముగా) పాప విముక్తుని చేయుటకు అన్ని పుణ్యతీర్థములలోనూ నాచేత అభిషేకములను స్వీకరించి నన్ను అనుగ్రహించు. నీ అంతటివాడిని అభిషేకించాననే తృప్తి నాకు కలిగించు. శ్రీవేంకటేశ్వరా! వేదములను తెచ్చిన (సోమకాసురుని మత్స్యావతారంలో సంహరించి తెచ్చినవాడు శ్రీహరి). అట్టి నీకు, ఏము (మేము), (నేము అనే పాఠంలో వున్నది. నేము అంటే ధాన్యం చెరుగుట అని అర్థం) వేదమంత్రాలు వల్లిస్తూ పూజచేస్తున్నాం. సరే మా అజ్ఞానంమాది. అయినా ఓ మహానుభావా! ఈ చోట మమ్ముర‌క్షించుటకు నీ దాసులమైన మమ్ము కరుణించి ఈ మూర్తిలోనికి వేదమూర్తివై వచ్చి ఇందులోనే నెలకొని మమ్ము ధన్యులను చేయుము తండ్రీ!



అ ఆ ఇ ఈ లలో అన్నమయ్య

# 47 ర

రాగం : దేశ్

రచ్చకెక్కితివి పండరంగి విఠలా
పచ్చి దేరేవింతలోనె పండరంగి విఠలా ॥రచ్చకెక్కి॥

గుట్టుగల దొరవని కొసరి చూచినంతనే
రట్టుగా నవ్వేవు పండరంగి విఠలా
మట్టుమీరి తమకపు మాటలనె నీవలపు
బట్టబయలు సేసేవు పండరంగి విఠలా ॥రచ్చకెక్కి॥

సాగిన సబలలోన సన్న సేసినంతలోనె
రాగిదేవించేవు పండెరంగి విఠలా
వేగిరపు చేతలనె విరివి నీ మోహ మెల్ల
బాగుగా వెళ్లవేసేవు పండరంగి విఠలా ॥రచ్చకెక్కి॥

తతి నీ వున్న చోటికి దగ్గర వచ్చినంతనె
రతి కూడితివి పండరంగి విఠలా
గతియైన శ్రీవేంకటనాథ యేలితివి
పతివై కోవిలకుంట్ల పండరంగి విఠలా ॥రచ్చకెక్కి॥

భావామృతం :

ఓ పాండురంగ విఠలా! వీధినబడి గోల చేస్తావేమయ్యా! (రచ్చకెక్కావు), కాస్తకూడ బిడియం లేకుండా పచ్చిదేరేవు (మరుగులేకుండా బట్టబయలు చేసేస్తున్నావు (నన్ను...) ఇంతలోనే అలా చేస్తే ఎలా స్వామీ!

నీవు నా గుట్టు కాపాడే స్వామివని నిన్ను కొసరి కొసరి (మరీ... మరీ) చూచిన మాటనిజమే. అందుకని రట్టుగా (నిందలపాలయేట్లుగా) నవ్వుతావా? హద్దుమీరిన మైమరపు మాటలాడి నీకు నామీద నున్న ప్రేమ బట్టబయలు చేసేస్తున్నావు. నీకిది తగునా విఠలా?

విఠలా ఒకపక్క సభ జరుగుతుంటే సన్నసేసేవు(సైగలు చేస్తావు) అంతలోనే రాగి దేలించేవు (రంజింప జేస్తావు) నీవేగిరంపు (తొందరపాటు) చేతలతో నీకు నాపైగల మోహాన్ని బాగా అందరికీ తెలిసేట్లు వెళ్లగక్కుతావు. ఓ పాండురంగా! ఇది నీకు మర్యాదా? (ఎందుకలా నలుగురిలో గుట్టురట్టు చేస్తావు?)

ఓ విఠలా! సమయం చూసికొని నేను నీవున్న చోటికి రాగానే వలపులలో ముంచెత్తుతావు (రతికెక్కితివి) అక్కడ తిరుమలలో వున్న వేంకటనాధుడే నీవై ఈనాడు కోవెల కుంట్లలోని పాండురంగ విఠలా! నీవు మాకు భర్తవై మమ్ము సదా కటాక్షించు ప్రభూ!

## 48 ల

**రాగం : ఆహిరి**

లక్ష్మీకళ్యాణము లీలతో బాడే మిదే నేడు
లక్ష్మీనారాయణులే లలనయు నీవును ॥లక్ష్మీ॥

చూపులే చూపులు మీకు సూనకము బాసికము
వూపుచున్న గుబ్బలివి బూజగుండలు
తీపులమోవితేనెలు తీరని మధుపర్కము
దాపుగ బెండ్లియాడేరయ్య తగుదగు మీకును ॥లక్ష్మీ॥





మాటలు మీకిద్దరికి మదనమంత్రములు
మేటి తలబాలు మీలో మించునవ్వులు
గాటమైన పులకలు కప్పురవసంతాలు
నీటున బెండ్లాడరయ్య నెరవేరె మీకును ॥లక్ష్మీ॥

కౌగిలి కౌగిలి మీకు కందువ పెండ్లి చవికె
పాగినకోరికలే పావకోళ్ళు
ఆగిన శ్రీవేంకటేశ అలమేలుమంగా నీవు
వీగక పెండ్లాడుడయ్య వేడుకాయె మీకు ॥లక్ష్మీ॥

**భావామృతం :**

నేడు మంగళప్రదమైన కళ్యాణము గురించి పాడి, ఇదిగో ఆ వివరాలు లీలతో చెబుతున్నాము. ఓ మహానుభావా! నీవును ఆ తల్లి అలమేల్మంగ స్వయంగా లక్ష్మీనారాయణులే. (మామూలు పెళ్ళిలో అలా భావించమంటారు, కానీ ఇక్కడ స్వయంగా ఈ వధూమరులు లక్ష్మీనారాయణులే)

మీరు ఒండొరులను పరవశంతో చూచుకొనుచున్నారు. మీ చూపులే సూనకము (స్త్రీలుతలలో ధరించు పాపిడిబిళ్ళ) మరియు బాసికము (వధూవరులు నుదుటకట్టుకొనే పట్టీ). ఊగుచున్న ఘనస్తనద్వయమే ఐరేణికుండలు. మీ మీ మధురాధరసుధయే మధుపర్కము అనే పెరుగు తేనె కలిసిన పానీయం. (మధుపర్కము అంటే వధూవరులకిచ్చే చదివింపు వస్త్రములు అని శ్లేషకూడా ఇక్కడవున్నది) మీరు ఏకమై పరిణయమాడుతున్నారు స్వామీ! మీకు పరస్పరం ఇది తగునట్లున్నది.

స్వామీ! పురోహితులు మీచే వేరే మదన మంత్రాలు చదివించ నక్కరలేదు మీరు మాట్లాడుకొనే మాటలే అలా వున్నాయి. మీరు ఒకరిని చూచి ఒకరు సమ్మోహనంగా నవ్వుకొంటుంటే ఆ నవ్వులు ఒకరిపై ఇంకొకరు తలంబ్రాలు పోసికొంటున్నట్లుంది. ఆ చేతులు ఒండొరుల తలలకు (కావాలని) తగిలించుకొంటున్నప్పుడు కలిగే పులకింతలే కర్పూరవసంతం ఆడుకొంటున్నారా (వెంట్రుకలు నిక్కబొడుచుకొంటే అలాగే వుంటుంది) అనునట్లున్నది. మీ ఇద్దరూ వైభవంగా పరిణయమాడండి స్వామీ మీకన్నీ నెరవేరుతాయి.

మీరుఒండిరులను పరవశించి కౌగిలించుకొనగా తాపముదీర్చు ఆ ఆలింగనమే వివాహమండపమా అనిపిస్తోంది. వ్యాపించినగాఢమైన కోరికలే పావకోళ్ళు (వరుడు ధరించుకొయ్యపాదరక్షలు). నిలిచిన ఓ శ్రీవేంకటేశ్వరా! నీవూ, నీదేవేరియైన అలమేలుమంగమ్మ వెనుదీయక నిత్యకళ్యాణం జరుపుకోండి. మీకు అదొకవేడుక. (మాకు అదే భాగ్యము.)

## 49 వ

**రాగం : హిందోళం**

వచ్చెను అలమేలు మంగ ఈ
పచ్చుల కడియాల పణతి చెలంగ ॥వచ్చెను॥

బంగారు చేదివిటీలు పూని
శృంగారవతులు వేవేలు రాగా
రంగైన వింజామరలు వీవ
మాంగల్య లీల సొంపగు జవరాలు ॥వచ్చెను॥





పలుకుల తేనియ లొలుక చెంత
చిలుకలు కలకల పలుక రవల
గిలుకు పావలు ముద్దు గులుక మేటి
కలికి చూపుల మొనలు తళుకని చిలుక ॥వచ్చెను॥

రంభాది సతులెల్ల చేరి ఎదుట
గంభీర గతులను మీర నటనా
రంభములను మేలు కోరి కొలువ
అంభోజాక్షుడౌ వేంకటేశునొయ్యారి ॥వచ్చెను॥

**భావామృతం :**

ఇదిగో చూడండి, ఇదే వచ్చెను అలమేల్మంగమ్మ. ఈమె మరకతములు తాపిన చేతి కడియములను ధరించి శోభిల్లుచున్నది.

అనేకమంది శృంగార పరిపూర్ణులైన చెలికత్తెలు బంగారు దివిటీలు (కాగడాలు) చేతిలో ధరించి వెంటరాగా అందమైన వింజామరలు (తెల్లని చామరము)చే వీచుటకు మరికొందరు ఆయత్తమవగా ఆ జవరాలి మాంగల్యము మనోహరముగా మెడలో వూగుచుండినది.

ఆమె పెంపుడు చిలుకలు, తేనెలొలుకునట్లు మధురముగా 'గలగల' పలుకు చుండినవి. ఆమె పావలు (పావుకోళ్ళు) ముద్దులొలుకు గిలుకు(సవ్వడి) ను చేయుచున్నవి, వాడియైన ఆమె చూపుల తూపులు తళుక్కుమని తళతళలను చిలుకుచున్నవి (వెదజల్లుచున్నవి).

రంభ మొదలైన అచ్చరలు అందరు చేరి ఆమె యెదుట గంభీరముగా నృత్యము సలుపుచుండిరి. వారి నటనా వైదుష్యమునంతయు ప్రదర్శించుచు ఆ దేవిని మేలుకొలుపు కొలువు సలుపుచున్నారు. పద్మదళాయతాక్షుడైన శ్రీవేంకటేశ్వరుని ఒయ్యారి భామ అయిన ఆదేవి మనోజ్ఞమైనది.

# 50 శ

**రాగం : జంఝూటి**

శరణు శరణు సురేంద్ర సన్నుత-శరణు శ్రీసతివల్లభా
శరణు రాక్షస గర్వసంహార-శరణు వేంకటనాయకా ॥శరణు॥

కమలధరుడును-కమల మిత్రుడు
కమల శత్రుడు పుత్రుడు,
క్రమముతో మీ కొలువుకిప్పుడు
కాచి నా రెచ్చరికయా ॥శరణు॥

అనిమిషేంద్రులు మునులు దిక్పతు
లమర కిన్నెర సిద్ధులు,
ఘనతతో రంభాది కాంతలు
కాచినా రెచ్చరికయా ॥శరణు॥

ఎన్నగల ప్రహ్లాద ముఖ్యులు
నిన్ను కొలువగ వచ్చిరి
విన్నపము వినవయ్య తిరుపతి
వేంకటాచల నాయకా ॥శరణు॥

**భావామృతం :**

దేవేంద్రునిచే సన్నుతింపబడెడి ఓ శ్రీనాథా! శరణు శరణు. ఓ రాక్షస గర్వనాశకా! శరణు శరణు. ఓ వేంకట నాయకా! శరణు శరణు.

విష్ణుమూర్తి, సూర్యభగవానుడు, చంద్రుడు,కుమారుడైన చతుర్ముఖుడు మీ యొక్క సన్నిధిని వరుసలో నిలిచి రక్షకులవలె హెచ్చరికగానున్నారు.

సురేంద్రుడు, మహర్షులు, దిక్పాలురు, దేవతలు,కిన్నెరులు, సిద్ధులు, ఆడంబరం ప్రదర్శించు రంభాది దేవకాంతలు, మొదలైన వారు వరుసలో హెచ్చరికగానున్నారు.





అగ్రగణ్యులైన ప్రహ్లాదుని వంటి ప్రముఖులు నిన్ను పూజించుటకు వచ్చిరి. ఓ తిరుపతి వేంకటేశ్వరా! మా మొరలను ఆలకింపుము ప్రభూ! శరణు శరణు.

# 51 ష

**రాగం : లలిత**

షోడశ కళానిధికి షోడశోపచారములు
జాడతోడ నిచ్చలును సమర్పయామి ॥షోడశ॥

అలరు విశ్వాత్మకు ఆవాహనమిదే సర్వ
నిలయునకు ఆసనము నెమ్మినిదే
అల గంగా జనకునకు అర్ఘ్య పాద్యాచమనాలు
జలధిశాయికి నిమజ్జనమిదే ॥షోడశ॥

వరపీతాంబరునకు వస్త్రాలంకారమిదే
సరి శ్రీమంతునకు భూషణములివే
ధరణీధరునకు గంధపుష్ప ధూపములు
తిరమిదే కోటి సూర్యతేజునకు దీపము ॥షోడశ॥

అమృత మథనునకు నదివో నైవేద్యము
గమిచంద్ర నేత్రునకు కప్పురవిడెము
అమరిన శ్రీవేంకటాద్రి మీది దేవునకు
తమితో ప్రదక్షిణాలు దండములు నివిగో ॥షోడశ॥

**భావామృతం :**

పదునారు కళలతో విరాజిల్లునట్టి స్వామికి పదునారు విధములైన షోడసోపచారములను జ్ఞానపూర్వకంగా నిత్యమూ సమర్పించెదము గాక!

విశ్వమంతయు వ్యాపించియున్న ఆత్మరూపునికి ఇదే ఆవాహనము,

చేయుచున్నాను. అన్నిచోట్లలో స్థితుడైయున్న స్వామికి ఆసనముప్రీతితో సమర్పించుచున్నాను. గంగకుజనకుడైన దేవరకు అర్ఘ్యపాద్యములను సమర్పించుచున్నాను. క్షీరసాగరశయనుడైన ఆ శ్రీమహావిష్ణువునకు నేనిదిగో నిమజ్జనము సేయుచున్నాను. (స్నానము చేయించుచున్నాను)

పీతాంబరుడైన విష్ణువునకు వస్త్రములతో అలంకరించెదను. లక్ష్మీకాంతునకు నగలను సమర్పింతును గాక! భూదేవీరమణునకు గంధము, పుష్పములు, సుగంధ దూపములను సమర్పింతును గాక! కోటి సూర్యులప్రకాశము గల స్వామికి నిత్యము దీపమును సమర్పించుచున్నాను.

పాలసముద్రమథనమున అమృతము నిప్పించిన స్వామికి నైవేద్యము నర్పింతును. సూర్యచంద్రులు నేత్రములుగా గల దేవునికి కర్పూరతాంబూలము నిచ్చుచున్నాను. శ్రీవేంకటాద్రిపైవెలసిన జగన్నాథునికి ప్రీతితో ప్రదక్షిణములు,దండములు ఇవిగో, ఇదే చేయుచున్నాను.

## 52 స

**రాగం : సామంత**

సహజ వైష్ణవాచార వర్తనుల
సహవాసమె మా సంధ్య ॥సహజ॥

అతిశయమగు శ్రీహరి సంకీర్తన
సతతంబును మా సంధ్య
మతి రామానుజమతమే మాకును
చతురతమెరసిన సంధ్య ॥సహజ॥

పరమభాగవత పదసేవనమే
సరవినెన్న మా సంధ్య
సిరివరు మహిమలు చెలువొందగ వే-
సరక వినుటే మా సంధ్య ॥సహజ॥





మంతుకెక్క తిరుమంత్ర పఠనమే
సంతతమును మా సంధ్య
కంతు గురుడు వేంకటగిరి రాయని
సంతర్పణమే మా సంధ్య ॥సహజ॥

**భావామృతం**

వైష్ణవ సిద్ధాంతములను నమ్మి శ్రీమన్నారాయణుని శరణు పొందినవానికి ఆ వైష్ణవులతో 'సహవాసము' చేస్తూ జీవించుటయే సంధ్య (సంధ్య వార్చుట), అను సంధ్యావందనము.

మా వైష్ణవులకు నిరంతరమూ శ్రీహరి నామ సంకీర్తన విశిష్టముగా చేయుటయే సంధ్యావందనము. త్రికరణ శుద్ధిగా శ్రీరామానుజాచార్యులవారి మతము (విశిష్టాద్వైతము) నవలంభించుటయే, మాయొక్క నేర్పరితనం చాటునటువంటి సంధ్య.

శ్రీమన్నారాయణుడే సర్వస్వం అని సద్బుద్ధితో సన్మార్గంలో జీవించే పరమ భాగవతోత్తములను గురువులుగా గౌరవించుచూ వారి పాదసేవనము చేస్తూ ఒక పద్ధతిగా జీవించుటయే నిజమైన సంధ్య. శ్రీపతియైన శ్రీహరి యొక్క దివ్యమహిమల గురించి విసుగులేకుండా శ్రద్ధగా వినుటయే మాకు సంధ్యావందనము.

ప్రసిద్ధికెక్కిన "ఓం నమో నారాయణాయ అను పవిత్ర అష్టాక్షరీ మంత్రమును త్రికరణ శుద్ధిగా ఎప్పుడూ జపించుటయే మాకు సంధ్యావందనము. మన్మథుని జనకుడైన వేంకటాద్రి సర్వేశ్వరుడు శ్రీవేంకటేశ్వరుని సంతర్పణ (తృప్తిగా సేవించుట) యే మా విశిష్టాద్వైతులకు నిజమైన సంధ్యావందనము. అంతేగాని భక్తిలేకుండా ఏదో ముక్కునపెట్టుకొన్నది చీదినట్లు, ప్రొద్దు పొడుచుటకు ముందు అయిదు ఘడియల కాలము, సూర్యుడు నడినెత్తిన వున్నప్పుడు, ప్రొద్దుగ్రుంకిన వెనుక మూడు ఘడియలు భగవంతునికి నమస్కరించుట (ప్రార్థించుట) మాత్రమే ఎన్నటికీ సంధ్యావందనము కాదు.

# 53 హ

**రాగం జోన్‌పురి**

హరినామమే కడు ఆనందకరము
మరుగవో మరుగవో మరుగవో మనసా ॥హరి నామమే॥

నళినాక్షుని శ్రీనామము
కలిదోషహరము కైవల్యము
ఫలసారము బహుబంధమోచనము
తలచవో తలచవో తలచవో మనసా ॥హరి నామమే॥

నగధరునామము నరకహరణము
జగదేక హితము సమ్మతము
సగుణ నిర్గుణము సాక్షాత్కారము
పొగడవో పొగడవో పొగడవో మనసా ॥హరి నామమే॥

కడగి శ్రీ వేంకటపతి నామము
బడి బడినే సంపత్కరము
అడియాలంబిల నతిసుఖమూలము
తడవవో తడవవో తడవవో మనసా ॥హరి నామమే॥

**భావామృతం**

హరినామస్మరణ మొక్కటే మిక్కిలి ఆనందమును కూర్పునది. కనుక ఓ మనసా! నీవు నామము కలిగించు ఆనందమును అదే యావగా పొందుము. మరల మరల పొందుము.

మంగళకరమైన ఆపద్మదళాయ తాక్షుని నామము కలిపురుషుని చే(ప్రాప్తించు దోషములను హరించి వేయును, మోక్షమునందించును. ఆ నామము పుణ్యఫలము యొక్క సారమైయున్నది. అనేకములైన బంధములను సడలించునది కూడ హరి నామమే. ఓమనసా ఆనామమును స్మరించుము. మరల మరల స్మరించుము.

గోవర్ధన గిరి నెత్తిన ఆ శ్రీహరినామము నరకమును నివారించునదైయున్నది. విశ్వమున కంతటికి ఈనామము మేలు కలిగించునది. సర్వులకు సమ్మతమైనదియు ఈనామమే. సుగుణ నిర్గుణ రూపుడైన పరమాత్ముని సాక్షాత్కరింప చేయునదియు ఈ నామమే. ఓమనసా! అట్టి నామమును స్తుతించుము. మరలమరల స్తుతించుము.





యత్నించి వేంకటేశ్వరుని నామము నా(శయిస్తే అతి శీఘ్రముగా సంపదలను వెలయ జేస్తుంది. గురుతుగా సుఖాలవాల మైన నామమును ఓమనసా వెదకరాదా మరల మరల యత్నించి వెదకరాదా!

# 54 ళ

**ఆ.వె॥ 'ళ' యను అక్షరంబు రాదు మొట్టమొదట**
**ఆంధ్రభాష పదములందు లేదు**
**అన్నమయ్య గీత మదియెట్లు తెలిపెద**
**సప్తగిరి నివాస సాధు వినుత!**

**భావామృతం**

ఆంధ్ర భాషలో 'ళ' తో మొదలయ్యే పదమేలేదు. సాధు జనులు కీర్తించు సప్తగిరీశా! అన్నమయ్య కీర్తన ఎట్లా వుంటుంది? మరి ఇంక ఇదే దారి తండ్రీ!

# 55 క్ష

**రాగం : మోహన**

క్షీరాబ్ధి కన్యకకు శ్రీమహాలక్ష్మికిని
నీరజాలయమునకు నీరాజనం ॥క్షీరాబ్ధి॥

జలజాక్షి మోమునకు జక్కువ కుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం
అలివేణి తురుమునకు హస్తకమలంబులకు
నిలువు మాణిక్యముల నీరాజనం ॥క్షీరాబ్ధి॥

చరణ కిసలయములకు సకియ రంభోరులకు
నిరతమగు ముత్తేల నీరాజనం
అరిది జఘనంబునకు అతివ నిజనాభికిని
నిరతి నానావర్ణ నీరాజనం ॥క్షీరాబ్ధి॥

పగటు శ్రీవేంకటేశు పట్టపు రాణియై
నెగడు సతికళలకును నీరాజనం
జగతి నలమేల్మంగ చక్కదనములకెల్ల
నిగుడు నిజ శోభనపు నీరాజనం ॥క్షీరాబ్ధి॥

భావామృతం

క్షీరసాగరమున జన్మించుటజేత క్షీరసాగరకన్య అయిన శ్రీమహాలక్ష్మికి పద్మవాసిని అయిన అలమేల్మంగమ్మకు మంగళహారతులివిగో!

పద్మనేత్రియైన పద్మావతీ దేవి యొక్క వదనమునకు జక్కువపిట్టలను బోలిన స్తనయుగ్మముపై అంటిన కర్పూరముతో వెలసిన కర్పూర నీరాజనమిదియే. ఈ అలినీలకుంతల (నల్లనిముంగురులు గల రమణి) చక్కటి కొప్పునకు, కమలముల వంటి (తామరపువ్వుల వంటి) చేతులకు మాణిక్యములతో నిలిచిన నీరాజనము ఇదే.

చిగురుటాకులవంటి పాదములకు, అరటి బోదెల బోలిన ఊరువులకు ఆసక్తితో నొసంగు ముత్యాల మంగళహారతి ఇదియే. దుస్సహమైన మొలకు, హరినారి నాభికీ పలువన్నెల మంగళహారతి సమర్పింతుము.

అలంకారములచే ప్రకాశించు శ్రీవేంకటనాథుని పట్టపు రాశి ఈ అలమేల్మంగమ్మ. పదునారు కళలతో వర్ధిల్లు ఈ సతి శ్రీమహాలక్ష్మి యొక్క దివ్య రూపమే కదా! లోకమాతయైన ఈమెకు భక్తి పూర్వకమైన నీరాజనము ఇదివో. లోకాలను పరిపాలించే మా తల్లి అలమేల్మంగమ్మ సౌందర్యమునకు విస్తృతమైన మంగళ నీరాజనములను సమర్పించుచున్నాను.

## 56 అ

**అట్టు సేయక రావె యిట్టె నీవు**
**గట్టిగా వచ్చేవంటాఁ గాచుకున్న వాఁడు ॥పల్లవి॥**

**చెలిమి చేసినవారు చేతికిలోను గావలె**
**చలములు సాదించ సంగతిగాదు**
**వలచిన వారలు వద్దఁ బాయకుండవలె**
**పొలయలుకలు చూపఁ బొసఁగ చెప్పుడును ॥అట్టు॥**

**సరస మాడేటివారు సమ్మతించి వుండవలె**
**నెరసులు పట్టేది నేరుపుగాదు**
**మరుతంత్రములవారు మంతనాన నుండవలె**
**విరసాన రచ్చలుంటే వేడుక గాదు ॥అట్టు॥**





**పొడఁబాటు గలవారు పొద్దికతో నుండవలె**
**అడియాసలఁ బొరలే దందము గాదు**
**అదరి శ్రీ వేంకటేశుఁడలమేల్మంగవు నీవు**
**తడియక కూడితివి తగులాయ మోహము ॥అట్టు॥**

భావామృతం

ఓ నెచ్చెలీ! నీవు అట్టు సేయక (నిందించకుండా) యిట్టే నీ ప్రియుని వద్దకు రావే. నీవు గట్టిగా (ధృడ నిశ్చయంతో) వచ్చెదవా అని ఆ కాచుకొని యున్నవాడు అనుమానిస్తాడు. కావున త్వరపడు.

పురుషులతో చెలిమి చేసిన వారు, వారి చేతిలో లొంగి వుండవలసి వస్తుంది. "చలములు సాధించ సంగతి కాదు" పట్టుదలలకు పోకూడదు. వలచిన వారిని యెన్నడూ వదలియుండరాదు. ఎప్పుడూ, పొలి యలుకలు చూప (రుస రుస లాడుట) పొసగదు (సరిపోదు).

సరసములాడుకొనే ప్రేయసీ ప్రియులు ఒకరిమాట ఇంకొకరు వినుటకు సిద్ధపడి వుండాలి. "నెరసులు పట్టేది" (ఒకరి తప్పులింకొకరు యెత్తి చూపటం), నేరుపు కాదు (తెలివైన పనికాదు). మరు తంత్రములవారు (శృంగార తంత్రములు వాడదలచినవారు) మంతనాలనుండవలె (ఒకరితో ఇంకొకరు మాట్లాడుకోవాలి గాని పోట్లాడుకోరాదు). సరసం విరసంగా మారి బజారుకెక్కారంటే అది మీకు సంతోషం కాదు కదా!

పరులసొమ్మునాసించువారు వినయ విధేయతలతో వుండవలెను. వారు అడియాస (ప్రత్యుపకారము జరుగుతుందనే ఆశతో) బొరలిన (వ్యవహరించుట) అందమైన పనికాదు. అలమేలుమంగవైన నీవు శ్రీ వేంకటేశ్వరునితో, అదరి (అతిశయించి) తడయక (తడబడకుండా) కూడినావు. ఇక మోహములు తగులాయెను (ఆసక్తికరములైనవి).